## చైర్మన్‌తో ముఖాముఖి





నూకారపు సూర్యప్రకాశరావు
చైర్మన్, సూర్య తెలుగు దిన పత్రిక

**ప్ర: ఇంధనం, నీటివనరుల కొరత తీవ్రస్థాయిలో ఉన్నాయి. రోజురోజుకూ సహజవనరులు తరిగిపోతున్నాయి. జనాభా మాత్రం రెట్టింపవుతోంది. రాబోయే తరం ఊహించుకుంటేనే భయం వేస్తోంది. సౌరవిద్యుత్ పట్ల ఇంకా ప్రజలలో పూర్తి స్థాయి అవగాహన లేదు. పవన విద్యుత్ వలన కలిగే ఉపయోగాలు కూడా జనాలకు తెలియదు. జనాలకు అర్థం అయ్యేలా అవగాహన కల్పిస్తే బాగుంటుంది?**

– ఎన్.పార్వతి, హైదరాబాద్

జ: సౌరవిద్యుత్ ఉత్పాదనవల్ల అనేక సౌలభ్యాలు ఉన్నాయి. సౌరశక్తి పుష్కలం... అనంతం. కాబట్టి, ఎక్కువ తక్కువ వంటి వినియోగ సమస్యలు ఎదురు కావు. వాడుకున్నవారికి వాడుకున్నంత. ప్రస్తుతం దేశంలో 65 శాతం విద్యుత్తు శిలాజ ఇంధనాల ద్వారానే ఉత్పత్తి అవుతోంది. ఈ పరిస్థితి ఇకముందూ కొనసాగే అవకాశముంది. భవిష్యత్తులో శిలాజ ఇంధనాలు తరిగిపోతే విద్యుత్ కష్టాలు అనివార్యమవుతాయి. అందువల్ల విద్యుత్ సుస్థిరతకు పునరుత్పాదక ఇంధన వనరుల వినియోగం తప్పనిసరి. అందుకు పవన, సౌర విద్యుత్తులే ఇప్పుడున్న ప్రత్యామ్నాయాలు. పవన విద్యుత్తులో ప్రపంచంలో మనదేశం అయిదో స్థానంలో ఉంది. సుమారు 23 వేల మెగావాట్ల పవన విద్యుత్ స్థాపక సామర్థ్యం దేశంలో ఉంది. అలాగే 750 గిగావాట్ల సౌర విద్యుత్ ఉత్పాదనకు అవకాశం ఉందన్నది అంచనా. సూర్యకిరణాల వేడి కారణంగా ఆరుబయట ఆరేసిన తడి వస్త్రాలు పొడి అవుతాయి. అలాగే, సౌరఫలకాలు సౌరశక్తిని పీల్చుకుని విద్యుత్తును ఉత్పత్తి చేస్తాయి. వేడి నీటి కోసం సౌరశక్తి వాటర్ హీటర్స్ గురించి మనకు తెలిసిందే. కర్బన ఉద్గారాలతో పర్యావరణనికి ఏర్పడుతున్న ముప్పు నేపథ్యంలో పునరుత్పాదక ఇంధన వనరులను వినియోగించుకోవడంపై ఇప్పుడు అందరి దృష్టి పడింది. 2008 జూన్‌లోనే నాటి ప్రధాని మన్మోహన్ సింగ్ వాతావరణ మార్పులను దృష్టిలో పెట్టుకుని జాతీయ కార్యాచరణ ప్రణళికను ఆవిష్కరించారు. అందులో తొలి ప్రాధాన్యం సౌర విద్యుత్ ఉత్పాదనకు ఇచ్చారు. జవహర్‌లాల్ నెహ్రూ జాతీయ సౌర విద్యుత్ మిషన్‌ను ఏర్పాటు చేశారు. కాకపోతే, అప్పటి 20 వేల మెగావాట్ల లక్ష్యం ఇప్పుడు లక్ష మెగావాట్లు అయింది.

జ: సర్కారియా కమిషన్ సిఫార్సులను ఖాతరు చేయకుండా ట్రైబ్యునల్ ఏర్పాటులో కేంద్రప్రభుత్వ జాప్యం, తీర్పు ఇవ్వడంలో ఆలస్యం సర్వసాధారణమైపోయాయి.

సభ్య రాష్ట్రాలకు ట్రైబ్యునల్ కేటాయించిన కృష్ణా జలాల విడుదల, వినియోగాన్ని నియంత్రించి, క్రమబద్ధీకరించడానికి ట్రైబ్యునల్–2 ఒక అంతర్రాష్ట్ర సంస్థను ఏర్పాటు చేసింది. అలా ఒక నియంత్రణ సంస్థను ఏర్పాటుచేసే అధికారం 1956నాటి చట్టంలోని విభాగం–6 ప్రకారం కేంద్రప్రభుత్వానికి ఉంటుందేకాని, ట్రైబ్యునల్‌కి ఉండదని రాష్ట్రాలు అభ్యంతరం తెలియజేశాయి. అదీగాక, అవసరమైన సిబ్బంది, విధులతో పాటు నేరాలకు శిక్ష విధించే అధికారాన్ని కట్టబెట్టినప్పుడే కృష్ణా జలాల విభజన అమలు బోర్డు సమర్థంగా పనిచేయగలుగుతుంది. ప్రస్తుతం అటువంటి అధికారాలు, అవసరమైన సిబ్బంది లేనందువల్ల ఆ బోర్డు సమర్థంగా తన విధ్యుక్త ధర్మాన్ని నిర్వహించలేకపోతోంది. ట్రైబ్యునళ్ల తీర్పులు అమలులోకి రావాలంటే కేంద్రసర్కారు చొరవ ఎంతో కీలకం. నదీజలాల వివాదాలకు సంబంధించిన సర్కారియా కమిషన్ సిఫార్సులను కేంద్రం కట్టుదిట్టంగా అమలుపరచాలి. నిర్ణీత కాలంలో ట్రైబ్యునళ్లు తీర్పులు ఇచ్చేలా చేసి, వాటిని కార్యాచరణ దిశగా నడిపించాలి. కృష్ణాజలాల విభజన అమలుకు సంస్థను చట్టం ప్రకారం కేంద్రప్రభుత్వం నియమించి, దానికి అవసరమైన సిబ్బందిని, నిధులను, నేరాలకు తగిన శిక్షలను విధించే అధికారాలను సమకూర్చి, ఆ సంస్థను బలోపేతం చేయాలి. ప్రస్తుతం ట్రైబ్యునళ్ల పరిశీలనలు, విచారణలు సుప్రీంకోర్టులో వాద, ప్రతివాదాలు ఒక వారం జరిగితే మూడు, నాలుగు నెలలు వాయిదాపడి, తీరిగ్గా జరుగుతున్నాయి. దీనివల్ల నదీజల వివాదాలు ఎన్నేళ్లు గడచినా ముడివడక కొనసాగుతూనే ఉన్నాయి. ఈ వివాదాల పరిష్కారం ఆలస్యమైనకొద్దీ రాష్ట్రాల మధ్య స్పర్థలు రగులుతూనే ఉంటాయి. న్యాయ నిర్ణయంలోని జాప్యం, న్యాయ నిరాకరణతో సమానమన్నది న్యాయశాస్త్రంలోని ముఖ్యసూత్రం. కాబట్టి, సుప్రీంకోర్టు, కేంద్రప్రభుత్వం, ట్రైబ్యునళ్లు ఈ న్యాయసూత్రాన్ని పాటించి, నదీజల వివాదాలను సాధ్యమైనంత త్వరలో పరిష్కరించినప్పుడే రాష్ట్రాల మధ్య సామరస్యం, సుహృద్భావం ఏర్పడి, దేశం ప్రగతిపథంలో పయనిస్తుంది.

**ప్రశ్న: తిరుమలేషునికి కేసిఆర్ ప్రభుత్వం నగలు ఇవ్వడం పట్ల విమర్శలొస్తున్నాయి. దేవుడికి నగలివ్వడం తప్పా.... కుటుంబ సమేతంగా దేవుని వద్దకు వెళ్ళడం పై కూడా విమర్శలు చేస్తున్నారు. దీన్నెలా చూడాలి.**

**జవాబు** : అన్ని మతాలను సమానంగా చూడటంలో కేసిఆర్ గొప్పతనం ఉంది. తెలంగాణ ఉద్యమం సందర్భంగా ఆయన మొక్కిన మొక్కులు తీర్చు కోవడంలో ఎంతమాత్రం తప్పు లేదు. ముస్లిం, క్రిష్టియన్ మతస్థులకు కూడా కేసిఆర్ అనేక పథకాలు కొనసాగిస్తున్నారు. హాజ్ పోయేవారికి, జెరుసెలం పోయేవారికి కూడా ప్రభుత్వం వైపు నుంచి సహకారం అంది స్తున్నారు. అలాంటప్పుడు హిందువుల దేవుళ్ళకు ఖర్చు పెట్ట డం తప్పెలా అవుతుంది. ఇది కూడా దేవాదాయ శాఖ నిధి నుంచే ఇవ్వడం హర్షించతగినదే.... దీన్ని కావాలని రాజకీయం చేయడం వల్ల ప్రతిపక్షాలు రెంటికి చెడ్డ రేవడే అవుతాయి తప్ప వాటికి ఉపయోగమేమీ ఉండదు.

ఇక కుటుంబ సమేతంగా గుడికి వెళ్ళడాన్ని కూడా రాజకీ యం చేయడం తగదు. దేవుని వద్దకు ముఖ్యమంత్రి హోదాలో వెళుతున్నపుడు తన కుటుంబ సభ్యులను తీసుకు పోవడంలో తప్పేమీ లేదు. దేవుడికి పూజలు చేసేప్పుడు శ్రీమతి పక్కనుండటం ఆచారం. సంప్రదాయం దాన్ని కాదన లేము. కేసిఆర్ గురించి ఆలోచిస్తే ఆయన అన్ని మతాలను సమానంగానే చూస్తారు. ఆయన అందరు దేవుళ్ళను విశ్వసిస్తారు.

మెయిల్ అడ్రస్
SPR publications, Surya Soudha, Plot.No: 185,
M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar,
Chandanayak Thanda, Madhapur, Opp: Hi-Tech City, Hyderabad - 500 072

## లెజెండ్

# అణుశక్తి దార్శనికుడు నీల్స్‌బోర్



***ఆటమిక్ స్ట్రక్చర్ పితామహునిగా పేరు పొంది, అణుశక్తిని శాంతియుత ప్రయోజనాలకు వినియోగించాలని ధైర్యంగా కృషిసల్పి, ఎలుగెత్తి చాటిన నీల్స్‌బోర్ అణుశాస్త్ర విజ్ఞాన రంగంలో అత్యధిక పురస్కారాలను, నోబెల్ బహుమతిని అందుకొన్న మహనీయుడు. అణుశక్తి రంగంలో రహస్యం మానవ వినాశనానికి దారితీస్తుందని, ప్రపంచ వ్యాప్తంగా ఆటమిక్ ఎనర్జీని రెగ్యులేట్ చెయ్యడానికి ప్రపంచ నియంత్రణామండలి ఏర్పాటు చేయాలని, అమెరికా ఆటంబాంబు ప్రయోగించడానికి ముందే హెచ్చరించిన అణుశక్తి దార్శనికుడు నీల్స్‌బోర్.ఆటం యొక్క స్ట్రక్చర్‌ను, ఆటం రేడియేషన్‌ను కనుగొన్న మహాశాస్త్రజ్ఞుడు నీల్స్‌బోర్.***

నియంతృత్వం చేతిలో వున్న శక్తివంతమైన సాధనం 'రహస్య విధానం' కానీ ప్రజాస్వామికం యొక్క అత్యంత శక్తివంతమైన సాధనం 'బహిరంగ విధానం" కావాలి అని ఎలుగెత్తి చాటి,అణుశక్తిని శాంతియుత ప్రయోజనాలకే వినియోగించాలని, అతి రహస్యంగా ఆటం బాంబు పరిశోధనలు జరుగుతున్న కాలంలోనే ఈ అణుశాస్త్రజ్ఞుడు నిర్భయంగా అమెరికా అధ్యక్షుడు రూజ్ వెల్ట్‌ను, బ్రిటిష్ ప్రధాని చర్చిల్‌ని స్వయంగా కలిసి సోవియట్ యూనియన్‌కి కూడా అణు రహస్యాలు తెలియజెయ్యాలని, అణుశక్తి రంగంలో రహస్యం మానవ వినాశనానికి దారితీ స్తుందని, ప్రపంచ వ్యాప్తంగా ఆటమిక్ ఎనర్జీని రెగ్యులేట్ చెయ్యడానికి ప్రపంచ నియంత్రణా మండలి ఏర్పాటు చేయా లని, అమెరికా ఆటంబాంబు ప్రయోగిం చడానికి ముందే హెచ్చరించిన అణుశక్తి దార్శనికుడు, ప్రముఖ నాస్తికుడు నీల్స్‌బోర్. ఆటం యొక్క స్ట్రక్చర్‌ను, ఆటం రేడియేషన్‌ను కనుగొన్న మహాశాస్త్రజ్ఞుడు. నీల్స్‌బోర్‌కు 1922 లోనే ఫిజిక్స్‌లో నోబెల్ బహుమతి లభించింది. ఫిజిక్స్‌లో 'క్వాంటం మెకానిక్స్' అనే కొత్త విభాగానికి రూపురేఖలు దిద్దిన ఈ గొప్ప సైంటిస్టు జీవితాంతం అత్యంత ప్రతిభావంతమైన పరిశోధనలు నిర్వహించి, అంతర్జాతీయ ఖ్యాతి పొంది, అంతవరకూ ఎవరికీ రానన్ని పురస్కారాలు అందుకున్న 'అణుకృషీవలుడు'. నీల్స్‌బోర్ క్వాంటం మెకానిక్స్ పితామహుడు.

### అద్భుత ప్రతిభాశాలి:

నీల్స్‌హెన్రిక్ డేవిడ్ బోర్ 1885 అక్టోబరు 7న డెన్మార్క్ రాజధాని కోపెన్‌హాగస్‌లో జన్మించాడు. తండ్రి ఫిజియాలజీ ప్రొఫెసర్. తల్లి యూదు. విద్యార్థిగా ఆటలలో నిష్ణాతుడు. ఫుట్‌బాల్‌లో గోల్‌కీపర్. తత్వశాస్త్రం, గణితం విద్యార్థిగా ఎన్నో అవార్డులు పొందాడు. సర్‌ఫేస్ టెన్షన్‌పై అతని పరిశోధనకు విద్యార్థిగానే ఎన్నో బహుమతులు పొందాడు. కోపెన్‌హెగన్ యూనివర్సిటీ నుండి 1911లో ఫిజిక్స్‌లో డాక్టరే టు పొందాడు. అఖండ ప్రజ్ఞాశాలి కావడంలో పోస్ట్ డాక్టోరల్ రీసెర్చి ఇంగ్లాండులో కేంబ్రిడ్జి యూనివర్సిటీలోను, రూథర్‌ఫర్డ్ వద్ద మాంఛెస్టర్‌లో చేశాడు. కోపెన్‌హెగెన్ యూనివర్సిటీ ప్రొఫెసర్‌గా ఖ్యాతి గడించాడు. అతని పరిశోధనలకు ఫిజిక్స్‌లో నోబెల్‌ప్రైజ్ వరించింది. తరువాత 1975లో ఫిజిక్స్‌లోనే అతని కుమారుడు ఆగీబోర్‌కు కూడా నోబెల్ ప్రైజ్ రావడం విశేషం.1921లో కోపెన్ హెగెన్‌లో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ థీరెటికల్ ఫిజికల్స్ డైరెక్టర్ అయ్యాడు.

### క్వాంటం మెకానిక్స్‌లో పరిశోధనలు:

క్వాంటం మెకానిక్స్‌లో మౌళిక పరిశోధనలు ప్రారంభించి ప్రపంచ దృష్టిని ఆకర్షించాడు. ఐన్‌స్టీన్ పరిశోధనలకు భిన్నంగా అతని పరిశోధన కొనసాగింది. వారిద్దరూ మంచి స్నేహితులే. అయినా పరిశోధనలో క్వాంటం మెకానిక్స్‌కి నీల్స్ బోర్ రూపకల్పన చేశాడు. 1940లో ఏప్రిల్‌లో హిట్లర్ సైన్యాలు డెన్మార్క్‌పై దాడిచేసి కొన్ని గంటలలో డెన్మా ర్కును ఆక్రమించాయి. 1944 సెప్టెంబరులో డెన్మార్కు రాజును నిర్భంధించి, సైన్యాన్ని తమ ఆధీనంలోకి హిట్లర్ తీసుకున్నారు. డెన్మార్క్ లోని 6000 మంది యూదులను హతమార్చాలని కుట్ర జరుగు తోందని గ్రహించిన బోర్, దాదాపు 50,000 మంది యూదులను స్వీడన్‌లోకి తరలించడానికి పూనుకొని,డెన్మార్కు రాజుతో చర్చించి ఒప్పించాడు. అంతకు ముందు కూడా వేలాది యూదులు స్వతంత్ర డెన్మార్క్ రావడానికి బోర్ తోడ్పడ్డాడు. బోర్ భార్య యూదు కావడంతో తనకి కూడా హిట్లరు నుండి ముప్పు ఉందని కుటుం బంతో స్వీడన్ తరలి వెళ్లాడు. ఈ ప్రఖ్యాత అణుశాస్త్రజ్ఞుడిని ప్రత్యేక విమానంలో ఇంగ్లాండుకు తరలిం చారు. అప్పటికి యింకా జర్మనీకి అణు అయుధాలు తయా రుగా లేవు. అందుచేత అమెరికా, ఇంగ్లాం డు,రష్యా ముగ్గురూ పరస్పర సహకారంలో అణు విజ్ఞానాన్ని పంచుకోవాలని, రష్యన్ సైంటిస్టులనుకూడా భాగస్వాములు చెయ్యా లని బోర్ భావించాడు.

### అమెరికా ఆహ్వానం:

అమెరికా అణుబాంబు కార్యక్రమంతో సహకరించ వలసిందిగా ఈ మహాశాస్త్రజ్ఞుని అమెరికా ఆహ్వానించింది. ఇంగ్లాండు నుండి అమెరికా వెళ్లిన బోర్ 1944లో అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్ట్‌ని అమెరికా సుప్రీం కోర్టు జడ్జి ఫిరిక్స్ ఫ్రాం క్‌ఫర్డ్ సహాయంతో బోర్ కలుసుకుని చర్చిం చాడు.

ఇంగ్లాండులో చర్చిల్‌ని కూడా బోర్ కలిసి అణు కార్యక్రమంలో రష్యాని కూడా చేర్చాలని బోర్ కోరాడు. కాని అమెరికా అధ్యక్షుడు, బ్రిటిషు ప్రధాని అందుకు అంగీకరించలేదు. దానికి బోర్ సమాధానం చెబుతూ అణు రహస్యాలు దాగవని, తక్కిన దేశాలు కూడా అణ్వాయు ,దాలు నిర్మిస్తా యని, ప్రతీదేశంలో శాస్త్రజ్ఞులు సమర్థులేనని బోర్ స్పష్టం చేశారు.



శిశువు హాయిగా నిద్రించే ఉయ్యాల, మృతుడు శాశ్వతంగా నిద్రించే సమాధి, ఈ రెంటిపైనా మెరిసే తార మానవుడి ఆశ. -అరవింద యోగి

# నమస్తే

గువ్వాలేని గోరింక !!!
గూడు కట్టి గుడిలో గువ్వా
గోరింక
తోడుపట్టి తిరిగె ఊరు వాడంట
ఊసులెన్నో ఉన్నాయి ఇరు
కన్నులంట
ఊహలెన్నో కన్నాయి
వరిసేలలంట
మదిని వీడనంటు మాటిచ్చినా
గువ్వా
మనసు మరేనంటు మార్చింది
తన తోవ
గుండె గంట మీటి గువ్వా
ఎగిరిపోయే
అది చూసి గోరింక గుండె
అదిరిపోయే
కన్న కళలు అన్నీ
కన్నీరైపోయాక
నిన్న జ్ఞాపకంగా మిగిలింది
గోరింక
ఏడ్చి ఏడ్చి కనులు
కడలయిపోయే
ఎండిపోయి గుండె తడి
ఆరిపోయే
జంట వీడినాక ఒంటరైపోయి
కంట నీరు రాక
మంటలయిపోయి
చిరుజల్లుకై వేచే ఆ చిన్ని
గోరింక
చితిమంటనార్పేది ఏ దేవుడో
ఇంక .

మురళీకృష్ణ ,విశాఖపట్నం
,9652408833



## రన్నింగ్ వాయిస్

### పజిల్స్ పెంచాలి

ఈ వారం వింతలు విశేషాలు ఎంత గానో బాగున్నాయి. వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

–హేమంత్, మౌలాలి

### కలర్ పేజీలు

కవర్ పేజీ కథనం సందర్భోచితంగా ఉంటోంది. పబ్లిక్‌ను ఇన్‌వాల్వ్ చేసే శీర్షికలు ఇస్తే బాగుంటుంది. అలాగే పాఠకుల అనుభవాలతో కూడిన ఓ శీర్షిక నిర్వహించండి. యూత్‌ను ఎంకరేజ్ చేసే శీర్షికలు, ఆడవారికి నచ్చే ఐటమ్స్ అన్నీ కవర్ అయితే సండే మరింత జనరంజకంగా ఉంటుంది. అన్నీ కలర్ పేజీలలో ఉండేలా చూడండి.




### వింతలు విశేషాలు

ఈ వారం వింతలు విశేషాలు ఎంత గానో బాగున్నాయి.వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

–వెంకట్, గొల్లపూడి

## 'కూని'రాగాలు

ఆదమరిస్తే అవకాశం చేజారవచ్చు..!
అనుసరిస్తే సొంతతనం కోల్పోవచ్చు..!!

మంచితనం మరణాన్ని జయిస్తుంది..!
మరుపుతనం జీవించడం నేర్పుతుంది..!!

పరనింద వ్యక్తిత్వాన్ని దిగజార్చుతుంది..!
అభినందన ఉత్సాహాన్ని రెట్టింపు చేస్తుంది..!!

స్థిరత్వం కోల్పోతే అజమాయిషీ లోపం..!
స్పందించడం ఆగిపోతే జీవించడం కష్టం..!!

లక్ష్యంలేని గమ్యం నిరాశాజనకం..!
రాజీలేని ప్రయాణం చైతన్యవంతం..!!

- కూనిరెడ్డి శ్రీనివాస్

### వంద శాతం

**కొడుకు** : డాడీ...ఇవాళ నాకు వంద మార్కులు వచ్చాయి...

**తండ్రి** : వెరీ గుడ్..మై చైల్డ్...ఎప్పుడూ ఇలానే మార్కులు తెచ్చుకోవాలి. ఇంతకీ ఏ సబ్జెక్టులో వచ్చాయి వంద మార్కులు....

**కొడుకు** : అన్ని సబ్జెక్టులు కలిపి వంద మార్కులు వచ్చాయి డాడీ...

### సేమ్ ఏజ్

**చంటి** : ఒరేయ్ బంటీ మీ ఫాదర్‌కి ఎంత ఏజ్ ఉండవచ్చు...

**బంటి** : సేమ్ నా ఏజ్ అయివుంటుంది ఇప్పటికి...

**చంటి** : అదెలా సాధ్యం...

**బంటి** : ఎందుకంటే నేను పుట్టిన తర్వాతే ఆయన ఫాదర్ అయ్యాడు. ఫాదర్‌గా అయన ఏజ్ కూడా ఇంచుమించు నా ఏజే అన్నమాట...

### ఆనందం...

**భార్య** : అబ్బ...అంత ఖర్చుపెట్టి ఎందుకండీ స్వీట్లు, పళ్లు తెచ్చారు...ఎలాగూమా అమ్మా..నాన్నా రావట్లేదని ఫోన్ చేశారు కదా....

**భర్త** : అందుకే ఆ ఆనందం తట్టుకోలేకే...ఇవన్నీ తెచ్చాను...

ఫన్ చ్










నారు



జ్ఞానం, విజ్ఞానం సంపాదించుకోవాలని అందూ అభిలషించేవారే. అయితే వాటికి మూల్యం చెల్లించడానికి ఇష్టపడేవారెవ్వరూ లేరు. -జువెనల్




1980లో విడుదలైన ఈ సినిమాకి కథా రచన, దర్శకత్వం జెమియూస్. ఈ పేరుతో వచ్చిన చిత్రాల సీరీస్‌లో ఇది మొదటిది. ఈశాన్య నమీబియాకి చెందిన థ అనే పిగ్మీ ఈ సినిమాలో ముఖ్య పాత్ర పోషించాడు. ఈ చిత్రానికి నాలుగు సీక్వెల్స్ కూడా నిర్మిత మయ్యాయి. మొదటి రెండూ సౌత్ ఆఫ్రికాలో తీయబడితే చివరి మూడూ మాత్రం హాంకాంగ్ లో నిర్మించబడ్డాయి. విశేషమేమిటంటే ఇందులో మూడు కథలు సమాంతరంగా నడుస్తూ వుంటాయి. సినిమా క్లైమాక్స్‌కి చేరుకున్నప్పుడు మూడింటినీ సమన్వయం చేస్తాడు దర్శకుడు.




# గాడ్స్ మస్ట్ బీ క్రేజీ

మొదటి కథ: నాగరిక జీవితం గురించి అస్సలు పరిచయం లేని పిగ్మీలనబడే ఒక తెగకు చెందిన అనే వ్యక్తికి నాగరికుల వల్ల కలిగే చిత్రమైన అనుభవాలను ఈ సినిమాలో తెరకెక్కించారు. తన తండాతో కలసి 'కలహారి ఎడారి'లో నాగరికులకి దుర్భరమనిపించే పరిస్థితులలో ఎంతో సంతృప్తికరంగా ఆనందంగా జీవిస్తుంటాడు. ఒకరోజు విమానంలో వెళుతున్న ఒక నాగరికుడు తాగి క్రింద పారేసిన కోకాకోల సీసా దొరకడంతో అది వీరి జీవితాలలోకి ఎలాంటి తంటాలు తెచ్చిందో, దాన్ని వదిలించుకోవడానికి ఎలాంటి తిప్పలు పడ్డాడో చూస్తాం. దాంతో – ఇది ఎవరి జీవితంలోకి వచ్చినా ఇలాగే సతమతమౌతారని నమ్మిన వ్యక్తి ఆ దయ్యపు వస్తువుని (కోకాకోల సీసాకి అతను పెట్టిన పేరు) వదిలించుకోవడానికి భూమి అంచుదాకా వెళ్లి అంతులేని అగాధంలోకి విసిరెయ్యాలని నిర్ణయించుకుంటాడు.(తండాలో అందరి అబ్బురపాటుకీ కారణమై తర్వాత లేనిపోని కొట్లాటలకు కారణమైన దయ్యపు వస్తువు)

రెండవ కథ: అమ్మాయిలతో ఎలా నడచుకోవాలో తెలియని ఒక ఆంత్రపాలజి డాక్టరు ఆ అడవికి వచ్చిన స్కూల్ టీచర్ మీద మనసు పారేసుకొని చెప్పలేక మానలేక సతమత మవుతుంటే మధ్యలో ఇంకొక తెలివైన టూరిస్టు గైడు పానకంలో పుడకలాగా మారుతుంటాడు. మన వాడికి వచ్చిన అవకాశాలను వాడు తన్నుకు పోతుంటాడు.

మూడో కథ: ఆ దేశపు మంత్రి మండలి మీద దాడి చేసి వారిని చంపడానికి విఫలయత్నం చేసిన మిలిటెంట్ బృందం, వారిని తరుముతున్న పోలీసుల నుంచి పారిపోతూ వుంటుంది. వారికి రక్షణ కవచంగా మన హీరోయిన్‌తో పాటూ ఆవిడ పనిచేస్తున్న స్కూల్ లో పిల్లల్ని కూడా బందీలుగా పట్టుకుని తీసుకుపోతారు.

డాక్టర్ గారూ.. అతని స్నేహితుడూ..స్కూల్ టీచర్

| | |
|---|---|
| Directed by | Jamie Uys |
| Produced by | Jamie Uys |
| Written by | Jamie Uys |
| Narrated by | Paddy O'Byrne |
| Music by | John Boshoff |
| Cinematography | Buster Reynolds<br>Robert Lewis |
| Edited by | Stanford C. Allen<br>Jamie Uys |
| Distributed by | Ster Kinekor (SA):77<br>20th Century Fox (US) |
| Release dates | 10 September 1980 (South Africa)<br>9 July 1984 (US: Limited)<br>13 July 1984 |
| Running time | 109 minutes |
| Country | South Africa<br>Botswana |
| Language | English |
| Budget | $5 million |
| Box office | over $60,000,000 (US) |

అలా బయల్దేరిన తన ప్రయాణంలో మన అమాయకపు డాక్టర్ నీ, ఆ స్కూల్ టీచర్ నీ కలుస్తాడు. వాళ్ళ లాంటి మనుషులని (నాగరికులని) అతను ఇదివరకు చూడకపోవడంతో వీళ్ళే దేవతలనుకొని ఆ సీసాని వెనక్కి తీసుకోమంటాడు. వారు నిరాకరించడంతో నిరాశ చెందుతాడు. (అతని దృష్టిలో దేవుడిచ్చిన– నీరు, చెట్లూ, కందమూలాలూ – అన్నీ మంచి వస్తువులే..! అతని దైనందిన జీవితంలో బతకడానికి పనికి వచ్చేవే..!! అన్నీ తండాలో అందరికీ చెందుతాయి. ఎవ్వరికీ ఏ ఒక్కటీ సొంతం కాదు. కానీ ఈ క్రొత్త వస్తువు అతనికి లేనిపోని తలనొప్పులు తెస్తుంది. దేవుడిచ్చాడని భావిస్తున్న ఈ సీసా వల్ల బోలెడు ఉపయోగాలు కనిపిస్తాయి.కానీ వస్తువు ఒక్కటే వుండడం

**వెంకటేష్ హీరోగా వచ్చిన బొబ్బిలి రాజా సినిమాలో చాలాచోట్ల ఈ సినిమాలోని సన్నివేశాలు యధాతధంగా వాడుకున్నారు. హీరో వెంకటేష్ చేత అయ్యో..అయ్యో అయ్యయ్యో..! అనిపించడం, జీపు డౌన్‌లోకి జారిపోవడం, దివ్యభారతి చెట్టు మీదనుంచీ దిగడం, నీళ్ళు పట్టడా నికి విండ్ మిల్ దగ్గర ప్రయత్నిస్తూ ఉండగా.. కోతి వచ్చి ఆ నీళ్ళు తాగెయ్యడం.. ఇలా చాలాఉన్నాయి.**

తో వారి తండాలో ఎవరికీ ఇదివరకూ అనుభవం లోకి రాని ఈర్ష్య, అసూయ, కోపం, ద్వేషం, స్వార్థ చింతన, స్వలాభాపేక్ష , హింస లాంటివి ఆ తండాలోకనిపిస్తాయి. అది ఎంతదూరం వెళ్తుందంటే దాన్ని వదిలించుకోవాలని అందరూ ఏకగ్రీవంగా తీర్మానించుకుంటారు. ఇప్పుడు ఆ దేవుళ్ళే కనిపించినపుడు ఆ దయ్యపు వస్తువుని వెనక్కియ్యబోతే తీసుకోకపోవడం థ కి బాధ కలిగిస్తుంది.)

ఈ నిస్పృహలో వుండగా, ఆకలేసి ఒక గొర్రెల మందలో ఒక గొర్రెని మత్తు కలిగించే బాణంతో కొడతాడు. వేటాడి నదాన్ని కలసే తిందామని ఆహ్వానించినా అంగీకరించని 'నాగరికుడైన' మంద యజమాని పోలీసులకు చెప్పి థని అరెస్టు చేయిస్తాడు. థకి తన తప్పేంటో అర్థం కాదు. వేటాడి తినడం అతని ప్రకృతి. అందరితో కలసి పంచు కొని తినడం అతని నైజం. పైగా భాష కూడా ప్రతిబంధ కంగా మారడం తో అతని గోడు వినే వారు లేక శిక్ష తప్పని పరిస్థితి వస్తుంది.

ఇలాంటి పరిస్థితిలో మన ఆంత్రపాలజి డాక్టరు గారూ, అతని స్నేహితుడూ (ఇతనికి పిగ్మీల భాష కూడా వచ్చు) కలసి ఇతన్ని చేరదీస్తారు. తమ దగ్గర అతని శిక్షా కాలం మూడు నెలలూ పూచీ పడి పనిలో పెట్టుకొంటారు. ఈ కాలంలో 'నాగరికుల' అలవాట్లూ ఆచార వ్యవహారాలూ కొద్ది కొద్దిగా తెలుసుకుం టాడు.

ఇంతలో ఆ టెర్రరిస్టులు స్కూల్ పిల్లల్నీ, టీచర్నీ కిడ్నాప్ చెయ్యడంతో వాళ్ళని రక్షించడానికి తన ఇద్దరు సహచరులతో పాటూ బయల్దేరతాడు. ఆ ప్రయత్నం లో సఫలమౌతాడా..,? ఆ సీసాని ఏం చేసాడు..??, డాక్టరు గారి ప్రేమకథ సంగ తేంటి..?? అన్నది మిగతా కథ.

దర్శకుడు ఈ సినిమాని ఒక డాక్యుమెంటరీ లాగా మొదలెట్టి, పిగ్మీల జీవన విధానం, వారి అలవాట్లు, వారి వేటాడే పద్ధతి, మొదలైనవన్నీ చూపిస్తూ దానికి కాంట్రాస్టింగ్‌గా నాగరిక సమాజం తీరు తెన్నులను చూపించే తీరు మన నాగరికులందరినీ అంతశ్శోధనలో పడేస్తుంది. మన పద్ధతులూ, మన టైం టేబుల్ మొదలైనవి ప్రకృతి సిద్ధమైన సహజ సూత్రాలకి ఎంతో దూరమన్న సంగతిని ఎత్తి చూపుతుంది. పిగ్మీల జీవన విధానాన్ని పరిచయం చేసేటప్పుడు చూపిన ప్రతీ అంశాన్నీ కథలో సమర్థవంతంగా వినియోగించుకుంటాడు. ఏ టైం టేబుల్, ఏ అసహజ మైన నియమాలూ లేని ప్రాకృతిక జీవనంలో వారెంత ఆనందంగా జీవిస్తుంటారో కళ్ళకు కట్టిస్తాడు. అలాగే నియమ బద్ధమైన మన నాగరిక సమాజంలో మనం ఏర్పర చుకొన్న నియమాలనే మనం ఎలా తుంగలోకి తొక్కు తామో చూపుతాడు.

ఈ సినిమా ప్రపంచవ్యాప్తంగా 1980 మొదట్లో రిలీజ్ అయినా అమెరికాలో విడుదల కాలేదు. దానికి కలిగిన మంచి పాజిటివ్ రెస్పాన్సు, వర్డ్ ఆఫ్ మౌత్ పబ్లిసిటీ తో రెండేళ్ళు ఆలస్యంగా 1982 లో విడుదలయ్యింది. దాని తరువాత 1989 లో రెండవ భాగం విడుదలయ్యింది. ఆతరువాత వచ్చిన మూడు సీక్వెల్స్ లోనూ (అది కూడా మూడేళ్ళలోనే)కూడా ప్రధాన పాత్ర పోషించింది..థయే..!!

అయితే ఈ సినిమా పుణ్యమా అని థ కి ప్రపంచ వ్యాప్తంగా పర్యటించే అవకాశం కలిగింది. చివరకు మళ్ళీ సరిగ్గా పదేళ్ళ తరువాత 1990లో తన స్వగ్రామానికి వెనక్కి వచ్చిన థ , దురదృష్టవశాత్తూ క్షయవ్యాధి మరణించాడు. 1984లో రెండవసారి విడుదలై 30 బిలియన్ డాలర్లు ఆర్జించిన ఈ సినిమాలో పాత్రలో నటనకు గానూ థ కి 300 మాత్రమే ఇచ్చారట. అయితే ఆయన మరణానికి ముందు మాత్రం 20,000/– ధనసహాయం, అలాగే నెలవారీ భత్యం కూడా ఏర్పాటు చేసారుట.

వెంకటేష్ హీరోగా వచ్చిన బొబ్బిలి రాజా సినిమాలో చాలా చోట్ల ఈ సినిమాలోని సన్నివేశాలు యధాతధంగా వాడుకున్నారు. హీరో వెంకటేష్ చేత అయ్యో..అయ్యో అయ్యయ్యో..! అనిపించడం, జీపు డౌన్‌లోకి జారిపోవ డం, దివ్యభారతి చెట్టు మీదనుంచీ దిగడం, నీళ్ళు పట్టడా నికి విండ్ మిల్ దగ్గర ప్రయత్నిస్తూ ఉండగా.. కోతి వచ్చి ఆ నీళ్ళు తాగెయ్యడం.. ఇలా చాలాఉన్నాయి.ఏదైనా గానీ పిల్లలూ పెద్దలూ బాగా ఎంజాయ్ చేసిన చిత్రం ది గాడ్స్ మస్ట్ బీ క్రేజీ.





అలవాటు అనేదాన్ని అరికట్టకపోతే, అది త్వరలోనే ఒక అవసరంగా మారిపోతుంది.-సెయింట్ ఆగస్టన్



ఎస్.పి.కోదండపాణి (1932 – 1974) సుప్రసిద్ధ తెలుగు సినిమా సంగీత దర్శకులు. వీరి పూర్తిపేరు శ్రీపతి పండితారాధ్యుల కోదండపాణి. అద్దేపల్లి రామారావు గారి... నా ఇల్లు చిత్రంలో బృందగానంలో మొదటిసారిగా 1953లో సినిమాలలో పాడే అవకాశం కలిగింది. సుసర్ల దక్షిణామూర్తి గారి వద్ద హార్మోనిస్టుగాను, సహాయకులుగా పనిచేశారు. 1955లో సంతానం చిత్రం ద్వారా స్వతంత్రంగా పాటపాడే అవకాశం లభించింది.



# సుస్వరాల బాణి కోదండపాణి

ఎస్. పి. కోదండపాణి పరిచయం చేసిన బాలసుబ్రహ్మణ్యం ఇంతింతై వటుడింతై బాలుగా తెలుగువారందరికీ సంగీతాత్మీయుడై తెలుగు చరిత్రలో తనకొక సుస్థిర స్థానాన్ని సంపాదించారు. బాలు స్థానం పటిష్టం కావడానికి ఆయన అవిరళ కృషితో బాటు ఎస్. పి. కోదండపాణిగారి కృషి కూడా చాలా ఎక్కువగా పనిచేసింది. ఆయన బాలు స్వరాన్ని తన




సంగీతంలో పరిచయం చేయడంతో బాటు చిత్ర రంగానికి పరిచయం చేయడానికి ఎంత శ్రద్ధ తీసుకున్నారో ఆ గళంలో పాట నిలబడడానికి అంతే శ్రద్ధ తీసుకున్నారు. ఆయన తొలి పాటను సంగీత దర్శకులందరికీ వినిపించి, అతనికి అవకాశాలిమ్మని కోదండపాణి గారే అడిగేవారట. బాలు గారికి ఆర్థికంగా సహాయపడడానికి తన దగ్గర సహాయకుడిగా పనిచేయించుకునేవారట. ఇతర సంగీత దర్శకుల దగ్గర బాలుగారు పాడిన పాటల్ని ప్రత్యేకంగా వెళ్ళి వినేవారట. పాటలో పొరబాట్లను క్షమించేవారు కాదట. చిన్న తప్పు చేసినా ఎత్తి చూపేవారట.

**ఇదిగో దేవుడు చేసిన బొమ్మ:**

ఎస్.పి.కోదండపాణి (1932 – 1974) సుప్రసిద్ధ తెలుగు సినిమా సంగీత దర్శకుడు. వీరి పూర్తిపేరు శ్రీపతి పండితారాధ్యుల కోదండపాణి. వీరు ఇదిగో దేవుడు చేసిన బొమ్మ వంటి కొన్ని పాటలు పాడారు కూడా. కోదండపాణి 1932వ సంవత్సరంలో గుంటూరులో జన్మించారు. ఆయన బాల్యం అంతా గుంటూరులోనే గడిచింది. 9వ తరగతి వరకు ఆ ఊరులోనే చదువుకున్నాడు. చిన్నప్పుడు పద్యాలు, పాటలు పాడటం, సంగీతం, హార్మోనియం నేర్చుకున్నాడు. అద్దేపల్లి రామారావు చిత్రం నా ఇల్లులో బృందగానంలో మొదటి సారిగా 1953లో సినిమాలలో పాడే అవకాశం కలిగింది. సుసర్ల దక్షిణామూర్తి వద్ద హార్మోనిస్టుగాను, సహాయకుడిగాను పనిచేశాడు. 1955లో సంతానం చిత్రం ద్వారా స్వతంత్రంగా పాటపాడే అవకాశం లభించింది. ఆ తరువాత కె.వి. మహదేవన్ వద్ద ఐదేళ్ళు బాధ్యతలు నిర్వహించి ఎన్నో మెళకువలు తెలుసుకోగలిగాడు.

హాస్యనటుడు పద్మనాభం రేఖా అండ్ మురళీ ఆర్ట్స్ సంస్థ పేరుతో నాటకాలు ప్రదర్శించేవాడు. ఆయనకు సంగీత దర్శకుడిగా సేవలందించాడు. అక్కడ సంపాదించిన కీర్తి ప్రతిష్ఠల వల్ల 1961లో కన్నకొడుకు చిత్రానికి సంగీత దర్శకుడయ్యాడు. తరువాత పదండి ముందుకు (1962), మంచి రోజులొచ్చాయి, బంగారు తిమ్మరాజు, తోటలో పిల్ల కోటలో రాణి, లోగుట్టు పెరుమాళ్ళకెరుక మొదలైన చిత్రాలకు పనిచేశాడు. తాను సంగీతం చేకూర్చే ప్రతి పాట శ్రావ్యంగా ఉండాలని, సాహిత్య విలువ దెబ్బతినకూడదని భావించేవాడు. ఈయన మొత్తం 101 చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించాడు. కోదండపాణి చిన్న వయసులోనే 42 సంవత్సరాలకే (5 ఏప్రిల్, 1974) న చనిపోయాడు.




పద్మనాభం చిత్రం శ్రీ శ్రీ శ్రీ మర్యాద రామన్న ద్వారా ఇతను 1967లో ఈనాటి ఉత్తమ గాయకుడు ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం ను తెలుగు తెరకు పరిచయం చేశాడు.

**చిరకాలం గుర్తుండే పాటలు:** బొమ్మను చేసి ప్రాణం పోసి – దేవత
ఇది మల్లెల వేళయనీ – సుఖదుఃఖాలు
జగమే రామమయం – శ్రీరామకథ
చుక్కలన్ని చూస్తున్నాయీ – జ్వాలాద్వీప రహస్యం

**బాలు ఆరోగ్యం పట్ల శ్రద్ధ:** బాలు గారి భవిష్యత్తుకు ఎంత ఆరాట పడ్డారో ఆయన ఆరోగ్యం కోసం కూడా అంతే ఆరాటపడ్డారు కోదండపాణిగారు. ఒకసారి బాలుగారు కష్టబడి సైకిల్ తొక్కుకుంటూ కోడంబాక్కం వంతెన మీద వెడుతుంటే అప్పుడే కారు మీద వెడుతున్న కోదండపాణిగారు చూసారు. బాలు గారిని ఆపి ఏమిటయ్యా పంతులూ ! ఈ ఎండలో సైకిల్ మీద విహారం ఏమిటీ ? బుద్ధి లేదూ ? ఆరోగ్యం బాగుంటేనే పాట బాగుంటుంది. బస్సులో వెళ్ళు. ఇకెప్పుడైనా సైకిల్ మీద కనిపించావో ఊరుకోను అని మందలించారట. ఆయన శ్రద్ధ, కోరిక ఫలించి తెలుగు వారికి మరో అద్భుతమైన గాయకుడు లభించాడు.

కోదండపాణిగారి గురించి బాలసుబ్రహ్మణ్యం ఓ సందర్భంలో మాట్లాడుతూ...కోదండపాణితో తన తొలి అనుభవాలను సవిరంగా తెలియజేశారు.. ఆయన సంగీత దర్శకత్వంలో పాడటం అంటే నాకు ఎంతో ఇష్టం. నేను చక్కగా పాడాలన్న కోరిక..ఆయనకు చాలా ఎక్కువ. ఎప్పుడైనా నేను పాడే పద్ధతి నచ్చకపోతే మెత్తగా గట్టిగా చీవాట్లు పెడతారు ఆయన. నేను ఎప్పుడైనా కారులో వేగంగా వెళ్లడం చూసారంటే ఏమిటా జోరు నిదానంగా పోరాదా అని ప్రశ్నించి మందలిస్తూంటారు. చాలా మంది నేనూ ఆయనా బంధు వులు(నేను ఎస్.పి.బాలసుబ్రమణ్యం–ఆయన ఎస్.పి.కోదండపాణి కనుక) అనుకుంటారు. మా ఇనిషియల్స్ చూసి నాకు ఆయన బంధువులు కారు. .అంతకన్నా అధికులు.. దైవ సమానులు. ఆయన సంగీత దర్శక త్వంలో నేను పాడిన ఎన్నో పాటలలో నాకు నచ్చిన పాట ఆస్తులు–అంతస్తులు చిత్రంలో సుశీలతో నేను పాడిన ఒకటైపోదామా అన్న పాట. మానసికంగా ఒకటై పోయిన కోదండపాణిగారు నాకు సంగీతపరంగా మానసికంగా గురువు...అని అంటారు.

**చిరకాలం గుర్తుండే పాటలు:**

★ బొమ్మను చేసి ప్రాణం పోసి – దేవత
★ ఇది మల్లెల వేళయనీ – సుఖదుఃఖాలు
★ జగమే రామమయం – శ్రీరామకథ
★ చుక్కలన్ని చూస్తున్నాయీ – జ్వాలాద్వీప రహస్యం

నా తొలి పాట రికార్డింగ్ జరిగిన రోజు దాదాపు నా సంగీత(చిత్ర)జీవితానికే తొలి నాడు. ఆ నాటి ముచ్చట్లు ఏ నాటికీ నేను మరచిపోలేని పన్నీటి జల్లులు,ఆనాడు నేను పాడేందుకు అవకాశం కలిగించినవి..ఆ నాటికి ముందు జరిగిన ఎన్నో విశేషాలు

**బాలు ఎంపిక జరిగిందలా:**

1964 జూన్ లో మద్రాసు సోషల్ అండ్ కల్చరర్ క్లబ్ వారు నిర్వహించిన లలిత సంగీత పోటీలో నేను పాల్గొన్నాను. నాటి ఆ పోటీకి మేటి సంగీతజ్ఞులు,సంగీత దర్శకులు అయిన ఘంటసాల, పెండ్యాల, సుసర్ల దక్షిణామూర్తి న్యాయ నిర్ణేతలు. అదృష్టవశాత్తు నాకు మొదటి బహుమతి లభించింది. నాడు నా పాట విన్న కోదండపాణికి నా గాత్రం,నేను పాడే పద్ధతి నచ్చింది. అవకాశం వస్తే,అప్పటికి ఒకింత లేతగా ఉన్న నా గాత్రం కాస్త ముదిరితే..నా చేత చిత్రాల్లో పాడిస్తానన్నారు. నేను సంగీత సాధన చేస్తూ, అడపాదడపా ఆయన్ను కలుసుకుంటూండే వాడ్ని. కోదండపాణి నా కోసం వివిధ సంస్థలలో అవకాశం కోసం ప్రయత్నించారు. దాదాపు రెండేళ్ళు నిరీక్షణలో గడిచిపోయాయి. 1966 డిసెంబర్‌లో ఆయన నాకు కబురు పంపారు. వెంటనే కలుసుకోమని. అది రేఖా అండ్ మురళీ వారి తరుపున. అక్కడికి వెళ్ళాను. ఏదైనా పాట పాడమన్నారు. నేనే వ్రాసి, సంగీతం సమకూర్చుకొనిన రాగమూ–అనురాగమూ అన్న పాట పాడాను. విని, మరొకటి పాడమన్నారు. దోస్తీ లోని రఫీ పాడిన జానే వాలో జరా పాడాను. నాకు మొదటి నుంచీ ఒక బలహీనత ఉన్నది. ఏ పాట విన్నా, విన్నది విన్నట్టు పాడక కొద్దిగా మార్చి స్వంత సంగతులు,గమకాలు వేసి నా పద్ధతిలో పాడుకునే అలవాటే ఆ బలహీనత. ఆ బలహీనత ఈ పాట(దోస్తీది)లో కనపడింది. అది కోదండపాణికి నచ్చింది. మరొక సారి పాట పాడించుకొని విన్నారు.

ఈ లోగా పద్మనాభం అక్కడికి వచ్చారు. తిరిగి జానే వాలో జరా పాడమన్నారు. పాడాను. ఆ పాట అక్కడ ఉన్న వాళ్ళందరికీ నచ్చడంతో శ్రీశ్రీశ్రీ మర్యాద రామన్న కథ చిత్రంలోని వీటూరి వ్రాసిన ఏమి ఈ వింత మోహం అన్న పాట పాడే అవకాశం వచ్చింది. మరుసటి దినం నుంచి రిహార్సల్స్. వారం రోజుల పాటు ప్రతీ రోజూ రేఖా అండ్ మురళీ వారి కార్యాలయానికి వెళ్ళడం. ఆ పాటను మొదటి నుంచి చివరి దాకా పాడటం నా కర్తవ్యం అయిపోయింది. చివరికి ఆ పాట నలుగురు పాడేదని తెలిసింది. నాతో బాటు ఎవరు పాడుతారో ఏమో నని భయం కలిగింది. ఆ పాటను మాల్కోస్,యమన్ కళ్యాణి,భాగేశ్వరి మొదలైన రాగాల మాలికగా రూపొందిచారు శ్రీ కోదండపాణి. ఆయన తత్వానికి నేనింకా కొత్త వాడ్ని. పొగిడినప్పుడు మొహం మీద ఎలా పొగిడేస్తారో,తెగడవలసి వచ్చినప్పుడు అంతే నిర్మొహమాటంతో తెగుడుతారు ఆయన. అటువంటి ఆయన నేను తప్పుగా పాడితో ఏమంటారో నన్న భావం కలిగింది.






## తెలుసుకోండి'లా'

నేను 1982లో ఒక దళిత మహిళను రిజిస్టర్డ్ వివాహం చేసుకున్నాను. నాకు ఇంటర్ చదువుతున్న 17 ఏళ్ళ కూతురున్నది. నా భార్య ఆమె కులం సర్టిఫికేటు తీసుకుంటే ఉద్యోగం దొరుకుతుంది. మాల కులం అని రాయిద్దామంటోంది. నేను ముందు జాగ్రత్తగా అమ్మాయి

# కులాంతర వివాహం - సంతానం

మా రెడ్డి కులంలో పెండ్లి సంబంధం కోసం రాయిద్దామంటున్నాను. చట్టం ప్రకారం నా కూతురు ఏ కులాని చెందినది?

– దయాకర్ రెడ్డి, కడప

మీది ప్రేమ వివాహం కనుక పిల్లకు తండ్రి కులం సంక్రమిస్తుంది. మీరు ఉద్యోగం గురించి తల్లి కులం సర్టిఫికేటు తీసుకుంటే అది నేరమవుతుంది. కనుక అలాంటి పనికి పాల్పడవద్దు. చట్టపరంగా మీ కూతురుకు మీ కులమే వస్తుంది. దీనికి భిన్నంగా నడుచుకుంటే ముందుముందు సమస్యలు ఎదురవుతాయి.

★★★

నా భర్తకు దాదాపు 15 ఎకరాల వ్యవసాయ భూమి ఉన్నది. తాను కష్టపడిన సంపాదనతో కొన్న సొంత ఇల్లు, కొన్ని భూములు ఏర్పరుచుకు న్నారు. నాకు నలుగురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు గలరు. అందరికి వివాహాలయ్యాయి. నా భర్త 5 సంవత్సరాల ముందు ఒక వీలునామా వ్రాసి వాళ్ళ అన్న కొడుకు దగ్గర పెట్టుకొన్నాడు. ఈ మధ్య కాలంలో అనగా 2 సంవత్సరాల క్రితం నా భర్త చనిపోయినాడు. ఆ తరువాత నా పిల్లలు ఎవరి సంసారం వాళ్ళు చూచుకొనుచూ నన్ను సరిగా పట్టించుకోవడం లేదు. ఈ విషయంపై నా కుమారులను, కోడళ్ళను అందరినీ పిలిపించి గ్రామ పెద్దల ద్వారా పంచాయితీ పెట్టగా ఎవరి కష్టాలు వాళ్ళు ఏకరువు పెట్టుచున్నారు కానీ, నా గురించి ఎవరూ పట్టించుకోవడం లేదు. ఇది చూచిన గ్రామ పెద్దలు ఒక నిర్ణయం చేసి కాగితం వ్రాసి ఇచ్చినారు. అది ఏమనగా నీ భర్త సంపాదించిన ఆస్తుల మొత్తం పై నీకు చట్ట ప్రకారంగా హక్కు గలదు. కావున ఈ భూమిని అనుభవించు కొనిగానీ, కౌలుకు ఇచ్చుకొని దాని ద్వారా గానీ నీ పోషణ చేసుకోమన్నారు. దానికి వీలుగానిచో కొంత ఆస్తి అమ్ముకోవాలని వ్రాసి ఇచ్చినారు. దీనికి నా కుమారులు ఎలాంటి ఆభ్యంతరం చెప్పలేదు. దీని అధారంతో నేను కొంత భూమి అమ్ము కొనుటకు పెట్టగా, నా భర్త అన్న కొడుకు అభ్యంతరం చేసినాడు. అది ఏమనగా మా బాబాయి నీకు వీలునామా వ్రాసినాడు గానీ దానిలో అమ్మడానికి వీలు లేదు అని వ్రాసినాడు. కావున ఆలాంటి భూమిని నీవు అమ్మడానికి వీలులేదు అని కోర్టులో నాపై కేసు వేసినాడు. దీని గూర్చి నాకు గల అధికారం నా భర్త ఆస్తులు న్యాయపరంగా వారసురాలుని కనుక నాకు అమ్ముకోవడం, జరుగు విధముగా న్యాయపరంగా హక్కు గూర్చి చెప్పుతూ... ఒకవేళ నా భర్త వ్రాసిన వీలునామా రిజిష్టరు కానిచో దానికి గల హక్కులు చెప్పగలరు.

– అనసూయమ్మ, వనపర్తి

మీ భర్త కష్టపడి సంపాదించిన ఆస్తికి తప్పక చట్ట పరంగా వారసురాలు మీరే. అదే విధంగా సర్వహక్కులు మీకు గలవు. గానీ ఇక్కడ మీ భర్త వ్రాసిన వీలు నామా రిజిష్టరు కావలసిన అవసరం లేదు. దాని ని తెల్ల పేపరుపై వ్రాసినా అది న్యాయపరంగా చెల్లుబాటు అవుతుంది. అలాంటి వీలునామా రిజిష్టరు కానిది చెల్లవు అని ఎక్కడా లేదు. అందువలన మీరు మీ భర్త అన్న కొడుకు దగ్గరకు వెళ్ళి మీ భర్త వ్రాసిన వీలునామాలోని పరిమితులు, షరతు లు, మీకు గల హక్కులు పరిశీలించ గలరు. అలాంటి షరతులను బట్టి మీకు మీ భర్త ఆస్తు లపై హక్కుగలదు. అదే విధంగా ఈ మధ్య కాలంలో ఒక కేసులో... భర్త ఉగ్రా రావ్ సింగ్ నుంచి విల్లు ద్వారా సంక్రమించిన ఇం టి స్థలాన్ని అమ్ముకొనుటకు వితంతువుగా ఉన్న వదిన ధన్‌వతికి హక్కు లేదంటూ జగన్ సింగ్ అనగా అమె భర్త యొక్క తమ్ముడు సు ప్రీమ్ కోర్టులో సవాలు చేయగా క్రింద గల అ లహబాద్ హై కోర్టులు జగన్‌సింగ్ అనగా ఆమె మరిది కేసు కొట్టి వేయగా దానిని సుప్రీం కోర్టు మాత్రం వీలునామాలోని షరతుల్ని బట్టి ఆ ఇల్లు అమ్మడానికి వీలులేదు. ఇది ఆమె భర్త ఆస్తి అయినందున చట్ట ప్రకారం వారసు రాళ్ళు, హక్కుదార్లు అయిన వీలునామా ప్రకారం అమ్మడానికి పి. సదాశివం సభ్యులుగా ఉన్న ధర్మాసనం వివరణ ఇచ్చినది. అక్కడ వీలునామా ద్వారా వచ్చిన ఆస్తులు పూర్తిస్థాయిలో హక్కు కలదు అని చెప్పవచ్చును.



★★★

నాకు 1989లో వివాహం జరిగింది. ఇద్దరు పిల్లలు. నా భార్య... పిల్లల్ని తీసుకుని తల్లి గారింటికి వెళ్ళిపోయి దాదాపు 8 మాసాలవు తున్నది. తల్లిగారి ఇంట్లో పిల్లలను వదిలిపెట్టి ఎక్కడికి వెళ్ళిందో తెలియదు. మా అత్తమామలను అడిగితే మాకు తెలియదని చెబుతున్నారు. కానీ సరైన కారణం చెప్పడం లేదు. దీనికి న్యాయ పరిష్కారం చెప్పండి.

– వీరేంద్ర, కరీంనగర్

మీ భార్య మీతో గొడవ పడ్డట్లు గాని, అక్రమ సంబంధం ఉన్నట్లు గాని ఇతర కారణాలేవీ చెప్పలేదు. ఏ కారణం చెప్పకుండా మీ భార్య మీ నుంచి దూరంగా ఎందుకు వెళ్ళిందో తెలీడం లేదు. కనీసం మీ అత్తమామలు కూడా చెప్పడం లేదు. కనుక భార్యను సంసారానికి రమ్మని కాంజుగల్ రైట్స్ మేరకు ఫామిలీ కోర్టు ద్వారా భార్యను పిల్లలను అడిగే హక్కు మీకుంది. లేదా మీ అత్తమామలపై అనుమానముంటే పోలీసు కేసు పెట్టండి. ఇదే కాక మానవహక్కుల సమాచారం కింద చైర్మన్‌కు లెటర్ రాస్తే మీకు న్యాయం జరుగుతుంది.

# గృహారంభ ప్రవేశ ముహూర్త విశేషాలు

## ముహూర్తం– వివాహం

ప్రస్తుతం నాగరిక మానవ సమాజాల్లో వివాహ వ్యవస్థకు ప్రత్యేక స్థానం ఉంది. కొన్ని సమాజాల్లో వివాహ వ్యవస్థ వధూవరుల మధ్య చేసికొన్న ఒప్పందం మాత్రమే. కాని భారతీయ సంప్రదాయం దానికి ఒక పవిత్రతను కల్పించింది. అదొక ధర్మసాధనం. ఉపనయనం తర్వాత బ్రహ్మచారి వివాహ చేసుకుని గృహస్థాశ్రమంలోకి ప్రవేశిస్తాడు. గృహస్థధర్మ నిర్వాహణకు సతి తోడు ఎంతో అవసరం. ధర్మం కోసం, సంతానం కోసం, సంపత్తి కోసం సతి అవసరం ఉంది. సంతానం వల్లనే పూర్వత్వసిద్ధి వస్తుందని వేదాలు చెబుతు న్నాయి. బ్రహ్మచర్యంతో విద్యాభ్యాసం పూర్తి చేసుకుని, తరువాత గురుదక్షిణ సమర్పించి, గురువు అనుమతితో వివాహం చేసుకుని, ప్రజాతంతువు తెగిపో కుండా ఉండేందుకు సంతానవతుడు కావాలని కూడా నొక్కి వక్కాణిస్తున్నాయి. జన్మతో వచ్చే మూడు రుణాల్లో పిత్రురుణ విముక్తి సంతానం వల్లనే సాధ్యం అవుతుంది. కనుక హిందూ వివాహ వ్యవస్థ ఎంతో ఉన్నతమైనదని అంటారు.

వివాహానికి ఉపయోగపడే మాసాలు

మాఘాదిపంచకం ఉపయోగపడుతుంది. అనగా మాఘం, ఫాల్గుణం, చైత్రం, వైశాఖం, జ్యేష్ఠ మాసాలు వివాహానికి ఉత్తమ మాసాలు.

ఆషాడం, భాద్రపద, పుష్య మాసాలు వివాహానికి పనికి రాని మాసాలు. శ్రావణం, ఆశ్వీయుజం, కార్తీక, మార్గశిర మాసాల్లో కూడా వివాహం చేయ వచ్చు. అధిక మాసాలు యోగ్యం కావు. మిధునం, ఆషాడ మాసాల్లో కూడా వివాహం చేయవచ్చని కొందరి పండితుల అభిప్రాయం. మీనం, చైత్రం కూడా వివాహ యోగ్యం కాదని ముహూర్త దర్పణం చెబుతోంది. చైత్రంలో శ్రీరామ కళ్యాణం తరువాతనే వివాహాలు చేయాలని సూచిస్తున్నారు. వధువరులు జన్మించిన మాసంలో వారికి వివాహం పనికి రాదని ముహూర్త దర్పణం తెలి పింది.

వారాలు

వివాహానికి బుధ, గురు, శుక్ర వారాలు ఉత్తమ వారాలు. శని, ఆదివారాలు మధ్యమాలు. మంగళవారం పనికిరాదు.

వివాహ తిథులు

విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, శుక్ల పక్ష కృష్ణ పక్షాలు రెంటిలోను పనికి వచ్చే తిథులు. శుక్ల పక్షంలో ఏకా దశి, ద్వాదశి, త్రయోదశి, పూర్ణిమలు కూడా వివాహ యోగ్య తిథులే. కొందరికి ద్వాదశి, మరికొందరికి ఏకాదశి, కొంద రికి పూర్ణిమలు పనికి రావు.

వివాహ నక్షత్రాలు

రోహిణి, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రాలు వివాహానికి ఉత్త మని ముహూర్త దర్పణం తెలుపుతోంది. మృగశిరను కాలా మృతం అంగీకరించింది. అశ్విని, చిత్త, శ్రవణం, ధనిష్ట, శత భిషం కూడా వివాహయోగ్య నక్షత్రాలేనని కొం దరి పండితుల అభిప్రాయం.

వివాహ యోగ్య లగ్నాలు

వృషభం, మిథునం, కర్కాటకం, కన్య, తుల, ధనస్సు, మీనం ఇవి వివాహ యోగ్య లగ్నాలు.

ఇతర అంశాలు

1. వివాహ లగ్నానికి సప్తమశుద్ధి ముఖ్యమైంది. దీనికే జామిత్రి శుద్ధి అని కూడా అంటారు. సప్తమ స్థానం వివాహ స్థానం కళత్రస్థానం
2. కేంద్ర స్థానాల్లో పాపగ్రహాలు ఉండరాదు. 1,4,7,10 స్థానాలు నాలుగు కేంద్ర స్థానాలు. కుజుడు, శని, రాహువు, కేతువు పాపగ్రహాలు.
3. వధువు, వరులిద్దరికీ తారాబలం చూడాలి. ఏ ఒక్కరికి నైధన తార కాకూ డదు.
4. గుణదోషాల్లో గుణాలు ఎక్కువగాను దోషాలు స్వల్పం గాను ఉన్న ముహూర్తం నిర్ణయించడం సంప్రదాయం.
5. అభిజిత్తు లగ్నం సర్వదోషాలను నివారిస్తుంది. సూర్యోదయ లగ్నం నుంచి నాల్గవ లగ్నం అభిజిత్తు. గోధూళికా లగ్నం కూడా ఇటువంటిదే. కాని పడమటి వారికి కళింగ దేశం వారికి మాత్రమే ఈ మూహూర్తం ముఖ్యమైనదని ముహూర్త దర్పణం చెబుతోంది.
6. గోచార రీత్యా వధూవరులకు గురు, సూర్య బలం ఉండాలి. జన్మరాశి నుంచి 3,6,10, 11 రాశుల్లో రవి, 2,5,9,11 రాశుల్లో గురువు శుభఫల దాతలు. వధువునకు గురుబలం, వరునకు సూర్యబలం ముఖ్యం.
7. కేంద్ర స్థానంలో శుక్రుడు ఉంటే ఐదువేల దోషాలు, బుధుడు ఉంటే ఐదు వందల దోషాలు, గురువు ఉంటే లక్ష దోషాలను పోగొడతారు. బుధ, గురువు, శుక్రులు కేంద్ర, కోణ స్థానాల్లో ఉన్న, పూర్ణ చంద్రుడు ఆరవ స్థానంలో ఉన్నా, చంద్ర, బుధ, గురు, శుక్రుల్లో ఏ ఒక్క గ్రహమైనా లగ్నంలో ఉన్న దోషాలను పోగొట్టి శుభ ఫలాన్ని ఇస్తారు.

సుసర్ల. బాబురావు
ఎం.ఎ (ఆస్ట్రాలజీ)



అంతా నిన్ను అవమానిస్తున్నప్పుడు, వినయంగా వుండడం మంచిది కాదు. కానీ అందరూ నిన్ను ప్రశంసిస్తూన్నప్పుడు వినయంగా వుండడం మాత్రం చాలా అరుదయిన విషయం. -సెయింట్ బెర్నార్డ్

# సినిమా నుండి టీవీ రంగంలోకి మన హీరోయిన్స్







చిత్ర సీమలో తమాషాలు జరుగుతుంటాయి. ఒకటి అవుతామని వచ్చి మరేదో అవుతారు. అని చాలా మంది అంటుంటారు. ఎక్కువగా హీరోయిన్స్ డాక్టర్ అవుతాని యాక్టర్ అయ్యాను. అని ఎక్కువ మంది హీరోయిన్స్ ఇంటర్వ్యూలో అంటారు. చిత్ర సీమలో పలు తమాషాలు చేస్తుంటుంది. ఎవర్ని ఒక చోట ఉండనియదు. సినిమాలో నటించే ఆర్టిస్టలు టివి లో నటిస్తుంటారు. టివిలో నటించే హీరోయిన్ సినిమాల్లో నటిస్తుంటారు. స్థాన చలనం పొందుతూ ఉంటారు. కుడి ఎడమైతే పొరపాటు లేదోయ్ అంటారు. సినిమాలో అవకాశాలు సన్నగిలితే హీరోయిన్‌ల చూపు ముందు అక్క, అమ్మ క్యారెక్టర్ వైపు దృష్టి పెట్టారు. ఆ తరువాత టివి ప్రొగ్రమ్, సీరియల్స్ మీద దృష్టి సారిస్తారు. నటిగా మంచి పేరు తెచ్చుకున్న హీరోయిన్స్ ఖాళీగా ఒక చోట కూర్చోవాలంటే కుర్చోలేరు. ఎదో ఒక పని ఉండాలి. సినిమా కోసం ప్రయత్నం చేసి ఆఖరికి టివిలో ప్రయత్నం చేస్తుంటారు.









అలా వచ్చిన రాధిక,సుహాసిని, యమున, భానుప్రియ, జయసుధ, నిహారిక, సుమ, సుమలత, జీవిత,రంభ, స్నేహ, రాశి, కిన్నెర, దీప వంటి వారు ఉన్నారు.

అలా వచ్చిన హీరోయిన్స్‌లో చంటిగాడు చిత్రంలో హీరోయిన్‌గా నటించిన సుహాసిని ఇప్పుడు టివి రంగంలో నంబర్ ఒన్ హీరోయిన్ పోజిషన్‌లో ఉంది. సినిమాల్లో రెండు,మూడు సినిమాల్లో హీరోయిన్‌గా నటించింది. కొన్ని సినిమాల్లో చెల్లి పాత్రలు కూడా వేసింది. ఆఖరికి టివి సీరియల్స్‌లో సుహాసిని స్థిరపడిపోయింది. ఇద్దరు అమ్మాయిలు సీరియల్స్‌కి నిర్మాతగా సొంతంగా నిర్మాణం రంగంలోకి కూడా దిగింది. సీరియల్స్‌లో మంచి పేరు సంపాదించుకుని , నిర్మాతగా సుహాసిని ముందుకు సాగిపోతుంది.

రాధికా హీరోయిన్ దాదాపు వంద సినిమాలో నటించి, ఆ తరం ప్రముఖ హీరోలతో జత కట్టిన రాధికా సినిమాల్లో అవకాశాలు సన్నిగిలి పోవటంతో టివి రంగంలోకి ప్రవేశించింది. ఎన్నో హిట్ సినిమాల్లో నటించిన రాధికా టివి రంగంలోకి వెళ్లేటప్పుడు చాలా మంది విమర్శించారు. చిరంజీవి, నాగేశ్వరరావు, ఎన్టీఆర్, శోభన్‌బాబు, కృష్ణ, కృష్ణంరాజు వంటి హీరోల సరసన నటించిన రాధికా ఎవరి మాటలు ఎక్కచేయక టివి రంగంలోకి ఆడుగు పెట్టింది. రాడన్ సంస్థను స్థాపించి సీరియల్స్ తీయడం ప్రారంభించింది. ఈ సంస్థ ద్వారా ఎన్నో సూపర్ డూపర్ హిట్ సీరియల్స్ నిర్మించింది. పిన్ని, అక్కయ్య, వంటి సిరియల్స్ రాధికాకు మంచి పేరు తేచ్చిపెట్టాయి. సీరియల్స్‌ను కార్పోరేట్ స్థాయిలో నిర్మించిన ఫస్ట్ నిర్మాత రాధిక అనే చెప్పాలి.మరో హీరోయిన్ జయసుధ ఎన్టీఆర్, ఎఎన్ ఆర్, చిరంజీవి, కృష్ణ, కృష్ణంరాజు వంటి ఎందరో హీరోలతో సూపర్ హిట్ ఇచ్చిన హీరోయిన్ జయసుధ. చంద్రమోహన్, మురళీమోహన్, మోహన్‌బాబు వంటి హీరోలతో ఎక్కువ చిత్రాల్లో హీరోయిన్‌గా నటించింది. జయసుధ ప్రధాన పాత్రల్లో రెండు సీరియల్స్‌లో నటిం చింది. ఆ రెండు సీరియల్స్ ప్రేక్షక ఆదరణ పొందలేక పోయ్యాయి. ఆ సీరియల్స్ మధ్యలోనే ఆగిపోయాయి. అక్కడ నుండి సినిమాల్లో అమ్మ,అక్క వేషాలు జయసుధ వేస్తుంది. తెలుగు, తమిళ్ భాషల్లో హీరోయిన్‌గా నటించిన భానుప్రియ తన రూట్‌ను మార్చుకుని టివి సీరియల్స్‌లో నటిస్తుంది. వంశీ హీరోయిన్‌గా మంచి పేరు సంపాదించుకున్న భానుప్రియ ఇప్పుడు టివి సీరియల్స్‌లో బిజి అయింది. యమున హీరోయిన్‌గా సినిమాలు చేస్తు న్న టైమ్‌లోనే టివి సీరియల్స్‌లో నటిం చింది. అన్వేషణ సీరియల్స్‌లో అచ్చుత్ సరసన వేల ఎపిసోడ్‌లో నటించింది. టివి రంగం అప్పుడప్పుడే పైకి వస్తున్న సమయంలో ఈటివిలో ప్రసా రం అయింది. ఆ సిరియల్స్‌లో యమునకు మంచి పేరు వచ్చింది. రంభ,స్నేహ ఇద్దరు రియాలిటీ షోలో పాల్గోంటున్నారు. రంభ, స్నేహ ఇద్దరు పెళ్లి చేసుకుని వెండి తెరకు దూరమై పిల్లలుకు తల్లి అయ్యారు. తెలుగు, తమిళ్ భాషలో స్నేహ అప్పుడప్పుడు నటిం చుంది. రంభ మాత్రం సినిమాకు దూరంగా ఉంటు వచ్చింది. ఇప్పుడు రియాలిటీ షోలో నటిస్తుంది. మెగా ఫ్యామిలీ నుండి వచ్చిన హీరోయిన్ నిహారిక. టివి రియాలిటీ షో నటించిన నిహారిక. నాగబాబు కుమార్తే. టి వి రంగంలో మంచి పేరు చేస్తుకుని హీరోయిన్ గా ఒక మనసు సినిమా తో సినిమారంగంలోకి పరిచయం అయింది. హీరోయిన్‌గా రెండు చిత్రాల్లో బిజిగా ఉంది.

సుమ టివి రంగంలో దూరదర్శన్‌లో సింగిల్ ఎపిసోడ్ ఉన్నప్పటి నుండి నటిస్తుంది. ఆ తరువాత జెమిని, ఈ టివి వచ్చిన తరువాత సుమను బిజి ఆర్టిస్ట్‌ను చేశాయి. సుమ చిన్నప్పటి నుండి టివి రం గంలోనే ఉంది. దాసరి నారాయణ దర్శకత్వంలో శిరస్తు కళ్యాణమస్తు చిత్రంలో హీరోయిన్‌గా పరిచయం అయింది. ఆ చిత్రం అంతగా ఆడకపోయిన ఆర్టిస్టలకు మంచి పేరు వచ్చింది. రైటర్ వక్కంతం వంశీ ఆ చిత్రానికి హీరోగా నటించాడు. ఆతరువాత సుమ రాజీమ్ కనకాల ను ప్రేమించి పెళ్లి చేసుకుని యాంకర్‌గా సుమ స్థిర పడిపోయింది. సుమలత సంసారం ఒక చదరంగం రియాలిటీ షో నటించుంది. ప్రతి రోజు వచ్చే సంసారం ఒక చదరంగం సీరియల్స్‌గా కోనసాగుతుంది. ఈ రియాలిటీ షోలో రోజా, జీవిత, రాశి, దీప వంటి ఒకప్పటి హీరోయిన్స్ రియాలిటీ షో బిజిగా మారిపోయారు.













పిసినిగొట్టు వాడు పేదవాడుగా కనిపిస్తూ అమిత ధనవంతుడవుతాడు. విలాస పురుషుడు ధనవంతుడిగా కనిపిస్తూనే పేదవాడవుతాడు. -గన్‌స్టన్

# సమర్ధవంతులైన తెలుగు నేతలు



**రాజకీయం అంటే ఏ పార్టీ అయినా, సిద్ధాంతాలు ఏవైనా అంతిమ లక్ష్యం రాజ్యాధికారమే. ఎవరైనా తమ చాకచక్యాన్నంతా ప్రదర్శించి యుక్తులు, కుయుక్తులు పన్ని, కుల రాజకీయాల్లో నెగ్గుకొచ్చి, డబ్బు ఖర్చు చేసి, ఎన్నికల్లో గెలిచి అధికారం చేపట్టినంత మాత్రాన సమర్థవంతమైన రాజకీయ నేతకాలేరు. రాజకీయాల్లో విజయం సాధించడంతోపాటు పరిపాలనా సామర్థ్యం, ఆర్థిక వ్యవస్థను క్రమపద్దతిలో పెట్టి ఆర్థికాభివృద్ధి సాధించడం ముఖ్యం.**



ఈ మూడు లక్షణాల్లో ఎవరైతే తమ సమర్థతను ప్రదర్శించగలరో వారే శక్తివంతమైన నాయకులుగా ఎదుగుతారు. గుర్తింపు పొందుతారు. అటువంటివారే దీర్ఘకాలంలో అధికారంలో కొనసాగగలరు. నేతలుగా మనగలిగి పదికాలాలపాటు గుర్తుండిపోతారు. రాజనీతి విషయంలో కొన్ని సందర్భాల్లో ఇది మంచి, ఇది చెడు అని చెప్పడం సాధ్యం కాదు. సమకాలీన పరిస్థితులు, రాజకీయ, సామాజిక అంశాల ఆధారంగా వ్యూహ రచన చేసి, అమలు చేయాలి. ఎవరు ఎన్ని చెప్పినా అది కాంగ్రెస్, బీజేపీ, తెలుగుదేశం పార్టీ అయినా, చివరకు వామపక్షాలైనా రాజకీయాల్లో కులాలు, వర్గాలు, గ్రూపులు, ప్రాంతాల ప్రాతిపదికగా రాజకీయాలు నడపక తప్పవు. ఎన్నికల సమయంలోనూ, ఆ తరువాత కూడా ఆయా వర్గాలను వివిధ రకాలుగా సంతృప్తి పరచవలసి ఉంటుంది. ఇటీవల కాలంలో కుల ఉద్యమాలు పెరిగిపోయాయి. కులాల ప్రాతిపదికగా నిధులు కేటాయించవలసిన పరిస్థితి ఏర్పడింది. వీటన్నిటిలో నెగ్గినవాడే అధికారాన్ని పొందగలుగుతాడు. దానిని నిలబెట్టుకోగలుగుతాడు. అన్ని సందర్భాల్లో ఒకే రకమైన రాజనీతి ప్రదర్శించడం సాధ్యం కాదు, ఆయా సందర్భాలను బట్టి రాజనీతి మారుతూ ఉంటుంది. అందలం ఎక్కిన తరువాత దీర్ఘ కాలం కొనసాగాలంటే పాలనానుభవం ఉండాలి. ఆర్థికాభివృద్ధి సాధించాలంటే ఆర్థిక అంశాలపై అవగాహన ఉండాలి. దేశ, విదేశాల్లోని ఆర్థిక సంస్థల నుంచి ఎంతైనా అప్పు తేవచ్చు. అయితే తీసుకువచ్చిన డబ్బుని సమర్థవంతంగా వినియోగించి (మనీ మేనేజ్ మెంట్) ఫలితాలను సాధించాలి.

రాజకీయాల్లో మన తెలుగు నేతలు రాష్ట్ర స్థాయిలోనూ, జాతీయ స్థాయిలోనూ పేరు గడించినవారు అనేక మంది ఉన్నారు. అయితే వారిలో దివంగత మాజీ ప్రధాన మంత్రి పీవీ నరసింహారావు (పాములపర్తి వెంకట నరసింహారావు), ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడులు అత్యంత శక్తివంతమైన పరిపాలనా దక్షులుగా గుర్తింపు పొందారు. చాకచక్యంగా రాజకీయాలను నడపడంలో, ఆర్థిక వ్యవస్థను అద్వితీయమైన రీతిలో చక్కదిద్దటంలో వారికి వారే సాటి. ఇద్దరూ ఇద్దరే. అపర చాణుక్యులు. 1991లో రాజీవ్ గాంధీ హత్యానంతరం అనుకోకుండా తప్పనిసరి పరిస్థితుల్లో పీవీ ప్రధాని అయ్యారు. అటు కాంగ్రెస్ పార్టీకి, ఇటు ప్రభుత్వానికి గడ్డు కాలం అది. పార్లమెంట్ లో ప్రభుత్వానికి సంపూర్ణ మెజార్టీ లేదు. ఆనాడు దేశంలో రాజకీయ అస్థిరత నెలకొంది. దానికి తోడు నిరుద్యోగం తాండవిస్తోంది. ఆర్థికవృద్ధి తిరోగమనంలో ఉంది. తయారీ రంగంలో సంక్షోభం నెలకొంది. విదేశీ అప్పులు పేరుకుపోయాయి. అన్ని విధాలా అస్థవ్యస్థ పరిస్థితులు నెలకొన్నాయి. ఆ పరిస్థితుల్లో దేశ ఆర్థిక వ్యవస్థ పూర్తిగా మందగించింది. అధ్వాన్న స్థితికి చేరుకున్న ఆర్థిక వ్యవస్థను పీవీ చక్కదిద్దారు. ఆయన ప్రవేశపెట్టిన సంస్కరణలు, సరళీకరణ విధానాల వల్లే ఆ తరువాత కాలంలో దేశ ఆర్థిక వ్యవస్థ అద్భుతమైన ప్రగతి సాధించింది. రాజకీయ అనుభవంలేని ఆర్థిక వేత్త మన్మోహన్ సింగ్‌ని కేంద్రంలో ఆర్థిక మంత్రిని చేశారు. ఆయనకు పూర్తి స్వేచ్ఛనిచ్చారు. అపర చాణుక్యుడిగా పేరు గడించారు. 1991 జులైలో మన్మోహన్ సింగ్ ప్రవేశపెట్టిన బడ్జెట్ దేశాన్ని ఆర్థిక సంక్షోభం నుంచి బయటపడవేసింది. ఆ బడ్జెట్ దేశంలో ఆర్థికంగా ఓ ఊపు తెచ్చింది. ఎగుమతులకు పెద్ద ఎత్తున ప్రోత్సాహం లభించింది. దిగుమతులను బాగా కట్టడి చేశారు. పన్ను విధానాల్లో కూడా మార్పులు చేసి కస్టమ్స్ సుంకాలను భారీగా తగ్గించారు. మన్మోహన్ తీసుకొచ్చిన సరళీకరణ విధానాలు సత్ఫలితాలనిచ్చాయి.

పార్లమెంట్‌లో తగిన బలం లేకపోవడం వల్ల రాజకీయంగా తలెత్తిన సంక్షోభాలను పీవీ తన సహజసిద్ధమైన తెలివితేటలు, అపార రాజకీయ అనుభవం, ముఖ్యమంత్రిగా, రాష్ట్రంలోనూ, కేంద్రంలోనూ వివిధ మంత్రిత్వశాఖల ద్వారా పొందిన అనుభవంతో చాకచక్యంగా ఎదుర్కొన్నారు. 1991 నుంచి 1996 వరకు పూర్తి కాలం అయిదు సంవత్సరాలు ప్రధానిగా కొనసాగారు. నెహ్రూ, గాంధీ కుటుంబాల నుంచి కాకుండా అప్పటి వరకు ఇతరులు ఎవరూ పూర్తి కాలం అయిదు సంవత్సరాలు ప్రధానిగా కొనసాగలేదు. ఆ ఘనత తెలుగువాడైన పీవీకే దక్కింది. అంతే కాకుండా ఇప్పటివరకు ప్రధాని అయిన తెలుగు నేత పీవీ ఒక్కరే.

పీవీలాగే చంద్రబాబు నాయుడు కూడా ఆ మూడు విషయాల్లో అత్యంత సమర్థతను ప్రదర్శిస్తారు. చాకచక్యంగా వ్యవహరిస్తారు. అత్యధిక కాలం 1995 నుంచి 2004 వరకు 9 సంవత్సరాలు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా కొనసాగి చరిత్ర సృష్టించారు. 1995లో అధికారాన్ని చేజిక్కించుకోవడంలో ఆయన ఎటువంటి రాజనీతిని ప్రదర్శించారో అందరికీ తెలిసిందే. 25 ఏళ్ల క్రితం పివి హయాంలో మొదలైన ఆర్థిక సంస్కరణల ఫలితాలు మన రాష్ట్రంలో కూడా కనిపిస్తున్నాయి. 1991 నాటి ఆర్థిక సంస్కర ణలు ప్రైవేటు రంగంలో విప్లవాత్మక మార్పులు తీసుకువచ్చాయి. దేశంలో సంపదతో పాటు ఉద్యోగ అవకాశాలు, ప్రజల జీవన ప్రమాణస్థాయి పెరిగాయి. 1995లో అధికారం లోకి వచ్చిన చంద్రబాబు ఆ సంస్కరణలను అందిపుచ్చుకున్నారు. ఆర్థిక పరంగా రాష్ట్రంలో గట్టి పునాదులు వేశారు. ఆ తరువాత వచ్చిన ప్రభుత్వం కూడా ఆయన బాట లోనే వెళ్లవలసి వచ్చింది. మళ్లీ 2014లో అధికారంలోకి వచ్చిన చంద్రబాబు గతంలో తను కొనసాగించిన విధానాలనే మళ్లీ కొనసాగించారు. ఆయన వేసిన పునాదులపై బలపడిన వ్యవస్థ నుంచి మంచి ఫలితాలు రావడం మొదలయ్యాయి. చంద్రబాబు నాయుడు విజన్ ఉన్న వ్యక్తి. ముందు చూపుతో భవిష్యత్‌ను దృష్టిలో పెట్టుకొని నిర్ణయాలు తీసుకుంటారు. అందువల్ల దీర్ఘకాలంలో ఆశించిన ఫలితాలు రావడానికి అవకాశం ఉంటుంది.

రాష్ట్రవిభజన జరిగిన నేపథ్యంలో అనేక రాజకీయ సమీకరణలను అత్యద్భుతంగా తనకు అనుకూలంగా మలచుకొని ఎన్నికల్లో విజయం సాధించారు. నవ్యాంధ్రప్రదేశ్ తొలి ముఖ్యమంత్రి అయ్యారు. రాష్ట్ర విభజన అసంఖ్యాకమైన కష్టాలను మన ముందుంచింది. జనాభా ఎక్కువ, ఆదాయం తక్కువగా వచ్చే ప్రాంతాన్ని ఏపీగా విభజించారు. ఉమ్మడి రాష్ట్ర ప్రధాన ఆస్తులు, భవనాలు అన్నీ హైదరాబాద్‌లోనే ఉండిపోయాయి. రాజధాని లేని, నిండా అప్పుల్లో మునిగిన ఏపీని అప్పగించారు. ఈ నేపథ్యంలో రాష్ట్రం అనేక సవాళ్లను ఎదు ర్కొంది. అయినా చెక్కుచెదరని ఆత్మవిశ్వాసంతో చంద్రబాబు ఒక పక్క నూతన రాజధాని అమరావతి నిర్మాణ పనులు పర్యవేక్షిస్తూనే, మరో పక్క వినూత్నమైన రీతిలో అభివృద్ధి వ్యూహాలను అనుసరించి సమ్మిళిత వృద్ధి సాధించారు.

ఆర్థికంగా క్లిష్ట పరిస్థితులలో ఉన్న ఆంధ్రప్రదేశ్ రెండేరెండేళ్ల వ్యవధిలో మంచి అభివృద్ధి సాధించింది. పలు అంశాలలో దేశంలోని ఇతర రాష్ట్రాలకు రోల్ మోడల్‌గా నిలిచింది. ఆయనకున్న అపార రాజకీయ, పాలనా అనుభవం ద్వారా రాష్ట్రంలో పుష్క లంగా ఉన్న సహజ, మానవ వనరులను సమర్థవంతంగా వినియోగించుకొని రెండంకెల వృద్ధిరేటు సాధించే విధంగా కృషి చేశారు. సమర్థ నీటి వినియోగంలో రాష్ట్రం దేశంలోనే అగ్రస్థానంలో నిలిచింది. రాష్ట్ర స్థూల ఉత్పత్తి (రాష్ట్రంలో ఏడాది కాలంలో జరిగిన మొత్తం ఉత్పత్తి- జిఎస్ డిపి- గ్రాస్ స్టేట్ డొమెస్టిక్ ప్రొడక్షన్) వృద్ధి రేటులో మొదటి స్థానానికి ఎగబాకింది. ఈ ఆర్థిక సంవత్సరం (2016-17)లో ముందుగా వేసిన అంచనాల ప్రకారం 12.61 శాతం వృద్ధి రేటు సాధించింది. రాష్ట్రంలో సరాసరి తలసరి ఆదాయం మొదటిసారిగా లక్ష రూపాయలు దాటి రికార్డు సృష్టించింది. 2015-16లో రూ.1,08,163లు ఉండగా, 2016-17లో రూ.1,22,376 తలసరి ఆదాయం ఉంటుందని అంచనా. చంద్రబాబు పాలనలో ఆర్థిక వృద్ధిరేటు ఏడాదికి ఏడాది పెరుగుతూ వస్తోంది. అర్థశాస్త్రంలో మాస్టర్ డిగ్రీతోపాటు ఎంఫిల్ కూడా చేయడం వల్ల ఆర్థిక విషయాల పట్ల ఆయనకు సంపూర్ణ అవగాహన ఉంది. పారిశ్రామిక పెట్టుబడులను ఆకర్షించడంలో రాష్ట్రం దేశంలో మొదటి ర్యాంకు సాధించింది. విద్యుత్ రంగంలో లోటు నుంచి మిగులుకు చేరింది. హుద్ హుద్ తుపాను వంటి ప్రకృతీవైపరీత్యాలు సంభవించినా, వర్షపాతం తగ్గి కరవు పరిస్థితులు నెలకొన్నా, ఇతర అనేక సమస్యలు వెంటాడుతున్నా రాష్ట్రం ఇంతటి విజయాలను సాధించడం చంద్రబాబు శక్తి,సామర్థ్యాలకు నిదర్శనం. నూతన రాజధాని అమరావతి నిర్మాణానికి భూసమీకరణ చరిత్రలో చిరస్థాయిగా నిలిచి పోయే ఘట్టం. వేల ఎకరాలు సమీకరించడం మాటలుకాదు. అంత భూమిని రైతులు ఇవ్వడానికి అంగీకరించరు. ఒకవేళ అంగీకరించినా అసలే లోటుబడ్జెట్‌లో ఉన్న రాష్ట్ర ఆర్థికస్థితి అందుకు అవకాశం ఇవ్వదు. ఈ పరిస్థితుల్లో చంద్రబాబు తనదైన తీరులో స్పందించారు. పూలింగ్ ద్వారా భూ సమీకరణ విధానం అతని ఆలోచనే. రైతులకు సమన్యాయం అందించేవిధంగా ఓ కొత్త విధానం మన రాష్ట్రంలో రూపుదిద్దుకుంది. ఇప్పటి వరకు 25 రెవెన్యూ గ్రామాల (29 గ్రామాలు)కు చెందిన 25,871 మంది రైతులు 32,513 ఎకరాల భూమిని స్వచ్ఛందంగా ప్రభుత్వానికి అప్పగించారు. ప్రపంచ చరిత్రలో ఎక్కడా ఇంత భూమి ఈ విధంగా సమీకరించలేదు. స్వచ్ఛందంగా కూడా ఇలా ఇంత భూ సమీకరణ చేయవచ్చని చేసి చూపించి చంద్రబాబు ఓ కొత్త వరవడి సృష్టించారు.





కంప్యూటర్‌కు సంబంధించి పీవీకీ, చంద్రబాబుకు సామీప్యం ఉంది. కంప్యూటర్‌ను ఉపయోగించడం, దానికి సంబంధించి కొత్త విషయాలు తెలుసుకోవడంలో పీవీ ఎప్పుడూ ముందుండేవారు. చంద్రబాబు కూడా ఈ విషయంలో చాలా శ్రద్ధ కనపరుస్తారు. కొత్త కొత్త అంశాలు తెలుసుకోవడానికి ఆసక్తి చూపుతారు. సాఫ్ట్‌వేర్ రంగం అభివృద్ధి చెందడానికి విశేషకృషి చేస్తున్నారు. పీవీ విషయానికి వచ్చేసరికి ఆయనకు అనేక అదనపు సామర్థ్యాలు కూడా ఉన్నాయి. ఆయన సాహితీస్రష్ట. 17 భాషలు తెలిసిన బహుభాషావేత్త. విశ్వనాథ సత్యనారాయణ రచించిన వేయి పడగలును హిందీలోకి అనువదించారు. అతని ఆత్మకథ ఇన్ సైడర్ (లోపలి మనిషి) గ్రంథం బహుళా ప్రాచుర్యం పొందింది. పరిపాలనలో మాత్రం ఇద్దరూ తమ సమర్థతను చాటుకున్నారు. చంద్రబాబు నాయుడు మూడవసారి ముఖ్యమంత్రిగా కొనసాగుతూ పాలనలో ఆధునిక అంశాలను చొప్పిస్తూ రాష్ట్రాభివృద్ధికి పాటుపడుతున్నారు.

-శిరందాసు నాగార్జున, సీనియర్ జర్నలిస్ట్.
9440222914



# వింతలు- విడ్డూరాలు



ప్రపంచవ్యాప్తంగా ప్రతీ 3 సెకన్లకు ఒక విమానం ల్యాండ్ అవుతోంది!

Aeroplane landing/Sec

నల్లత్రాచు ఏనుగును కరిస్తే ఆ ఏనుగు నాలుగు గంటల్లో చనిపోతుంది.





నీటి ప్రవాహం తక్కువున్నప్పుడు ఏంజెల్ జలపాతం నుంచి దూకే ధారలు నేలను తాకకుండానే ఆవిరైపోతాయి!

Angel Waterfalls



* ప్రపంచంలోకెల్లా అతిపెద్ద వాన చినుకుల్ని లేజర్ పరిజ్ఞానం ద్వారా గుర్తించారు. 8.6 మిల్లీమీటర్ల పరిమాణంలో ఉన్న ఈ బిందువులు 1995లో బ్రెజిల్‌లోనూ తరవాత 1999లో పసిఫిక్ మహా సముద్రంలోని మార్షల్ దీవుల్లోనూ కురిశాయట.

భూమ్మీదే అతి పెద్దదైన అమెజాన్ అడవిని ఒక దేశంగా



పరిగణిస్తే అది తొమ్మిదో అతి పెద్ద దేశమవుతుంది!



బెసంజీ అనే కుక్కలు మొరగవు. ఆఫ్రికాలో వీటిని వేటకోసం ఉపయోగించేవారు. ఇవి 17 అంగుళాల ఎత్తు, 11 కిలోల బరువు ఉంటాయి.



చీమ తన బరువు కన్నా 50 రెట్లు ఎక్కువ బరువుని ఎత్తగలదు, 30 రెట్లు ఎక్కువ బరువుని లాగగలదు.

ఏడాదికి అమెరికాలో 85,000,000 టన్నుల కాగితాన్ని వాడి పడేస్తున్నారు.



## కథ

# అందమైన జీవితం

డా.మంతెన సూర్యనారాయణరాజు



**సులక్షణా! మన వెంకటలక్ష్మి గారి అబ్బాయి పండరికి పెళ్ళయింది గదా! చాన్నాళ్ళ తర్వాత మూఢం వెళ్ళి కాపురానికొచ్చింది. వెళ్ళి చూసొద్దాం వస్తావా! అని గుమ్మంలో నుండి కేక వేసింది కృష్ణ తులసి. కట్టుకున్న పట్టుచీర కుచ్చెళ్ళు సర్దుకుంటూ సులక్షణ తులసి మాటలు వినిపించుకోలేదు. పల వసర్ల గొలుసు అలంకరించుకుని డ్రెస్సింగ్ టేబుల్ ముందు నిలబడి అద్దంలో చూసుకుంటోంది. కృష్ణతులసి సరాసరి సులక్షణ గదిలోకి ఎంట రయ్యింది. ఆమెను చూసి కొప్పులో తురుము కోబోతున్న పెద్ద మల్లె చెండును రెండుగా తెం పింది. ఒక ముక్క తన కొప్పులో అలంకరించు కుంది. మిగిలింది కృష్ణతులసి కొప్పులో తనే అలంకరించింది. ఇద్దరికీ బాడీ స్ప్రే తనే కొట్టింది సులక్షణ. ఇద్దరు వీధి గుమ్మం వైపు నడక సాగించారు.**

పండరీనాథ్ లుంగీ బనీనుతో సీరియస్‌గా టి.వి.లో క్రికెట్ మ్యాచ్ చూస్తున్నాడు. అతని భార్య మనోహరి భర్తకు టీ తీసుకొచ్చియిచ్చింది. వెంటనే దాన్ని భార్యను అదోలా చూస్తూ "అమ్మేది! రోజూ తనే తెచ్చి ఇచ్చేదిగా.." అన్నాడు. ముఖం చిట్లిస్తూనే మనోహరి పెళ్ళాన్నొచ్చానుగా! ఏం.. నేను ఇక నుంచి మీకు టీ ఇవ్వకూడదేవిటీ! ఎంత కాలం అమ్మకూచిలా అఘోరిస్తారు అంది ఆరిందాలా. వెంకటలక్ష్మి అప్పుడే అక్కడికొస్తూంటే మనోహరి అత్తగారిని రాసుకుంటూ వెళ్ళి భర్త తాగిన టీ కప్పు తీసుకుని వెళ్లిపోయింది. కొడుకు భుజం మీద చెయ్యేస్తూ పండరీ! దీని వరస చూస్తే నాకు అర్ధం కాకుండా ఉంది. నేను చెప్పేది ఏ ముక్కా పూర్తిగా వినిపించుకోదు. ఎదుటి వాళ్ళను ఏ మాటా కడదాకా చెప్పనీయకుండా మధ్యలో అడ్డుపడుతూంది. అంతా నా ఖర్మ అంది." తల్లి.

" నీ కర్మ కాదు.. నా కర్మ" అన్నాడు.పండరి.

అప్పుడే పనిమనిషికి ఇవ్వగా మిగిలిపోయిన పుల్లమజ్జిగతో వేసిన పుల్లట్లు పళ్ళెంలో పెట్టి మనోహరి వీధిలోకి తీస్కెళ్ళింది.

దగ్గర్లో పచ్చగడ్డి మేస్తున్న ఆవు ముందు పెట్టింది. ఆ దృశ్యాన్ని సులక్షణ, కృష్ణతులసి ఇద్దరూ చూశారు. ఆ కపిలగోవు ముందుగా వాటిని వాసన చూసింది.ముందు ముట్టె ప్రక్కకు పెట్టి తోకతో వంటి మీద వాలిన ఈగల్ని తోలుకుంది. మనోహరికి చిర్రెత్తుకొచ్చి నే వేసిన పుల్లట్లు నీక్కూడా నచ్చలేదేవిటే అంటూ గొణుక్కుంది. ఆకలి ఎక్కువగా వుందో ఏమో ఆ ఆవు ఆ అట్లను లుంగ పెట్టి వాటిని తినేసింది. తీరా వాటిని తినేశాక అది అక్కడ నిలబడనే లేదు. వేగంగా ఎటో వెళ్ళిపోయింది.

అప్పుడే ఇంటికొస్తున్న అతిథుల్ని స్వాగతిస్తూ లోనికి పిలిచింది. ఇద్దరూ హాల్లోకొచ్చి కూర్చుకున్నారు.

వెంకటలక్ష్మి ఆ యిద్దర్నీ పలకరించింది. ముగ్గురూ కబుర్లలో పడ్డారు. కృష్ణా! నువ్వెప్పుడు కొంటావ్ అల్లుణ్ణి అడిగింది వెంకటలక్ష్మి. వెంనే సులక్షణ కలుగజేసుకుంటూ కృష్ణతులసికి ఒక్కగానొక్క కూతురు. చెన్నైలో కెమికల్ ఇంజనీరింగ్ చేస్తోంది. కావాలంటే వాళ్ళాయన కొండమీద కోతిని తాడట్టుకుని దింపగల సమర్థుడు అంది. తులసి ఏదోటి మాట్లాడాల్సిన అవకాశం రావడంతో బ్లాక్‌లో కొందామనుకున్నా బ్లాక్ పెళ్ళికొడుకులే మనకు దొరుకుతున్నారే గాని, తెల్ల వాళ్ళెక్కడా దొరకడం లేదు. మా అమ్మాయి కుందనపు బొమ్మ తెలుసుగా! అందుకని మంచి బుద్ధిమంతుడైన కుర్రాడు దొరకాలి. పైగా ఈడూజోడూ అందంచందం కూడా కోరుకోవడంలో తప్పులేదు కదా! అంది.

అత్తగారితోబాటు మిగిలిన ఇద్దరికీ ట్రేలో మూడు కప్పులతో టీలు తెచ్చి అందించింది మనోహరి. ముగ్గురూ టీలు సిప్ చేశాకా ఖాళీ కప్పులు తీసుకుని అక్కణ్ణుంచి వెళ్లిపోయింది.

" వదినా మీ కోడలుకి పనీపాటలొచ్చా! వంటావార్పూ గట్రా బాగా చేస్తుందా! అత్తమావల్ని బాగా చూసుకుంటుందా! అసలే అన్నయ్య గారు మొహమాటస్తులు. పైగా చంటిపిల్లాడి మనస్తత్వం. నువ్వైతే ఆయన ఆలనా పాలనా జాగ్రత్తగా చూసుకుంటావు " అంది వెంకటటక్ష్మితో కృష్ణతులసి.

నిరాశానిస్పృహలతో ఉన్న ఇంటి యజమానురాలు కొద్దిగా నెమ్మదిగా" ఈనాటి ఆడపిల్లలకి మనకాలం ఆడపిల్లలకీ చాలా తేడా ఉంది. ఇప్పుడంతా పిదప కాలం. పిదప బుద్ధులు. అన్నింట్లో హైటెక్ స్పీడు. ఒక్కపనీ సరిగ్గా చెయ్యదు. అలాగని క్షణం తీరికగా కూర్చోదు. మెహర్బానీ కోసం మీలాంటోళ్ళొచ్చినప్పుడు తానే మంచీ, మర్యాదా, మన్ననా తెల్సిన దానిలా పెద్ద బిల్డప్ ఇస్తుంది. మా పండరి పైకి మాత్రం పెళ్ళామంటే గిట్టనట్టు నటిస్తాడు. కానీ అది వాణ్ణి కొంగున కట్టేసుకుని తప్పుకుంటోంది" అంది మూతి మూడు వంకర్లు తిప్పుతూ.

సులక్షణ ఆలశ్యం చెయ్యకుండా " అందుకనే వదినా పెద్దలు అడ్డాల నాడు బిడ్డలు గాని గడ్డాలొచ్చాక మన బిడ్డలేవిటి " అంటూ వెంకటలక్ష్మి మాటకు వత్తాసు పలికింది.

మనొహరికి వాళ్ల మాటలు వినిపించాయి. భర్త దగ్గరికెళ్ళి చేత్తో కావాలని తడుతూ వేణ్ణీళ్ళు తోడి "బాత్రూమ్‌లో పెట్టా! మీరెళ్ళి తొందరగా స్నానం చేసి వస్తే క్యారియర్ సర్దేసి ఉంచుతా! ఆఫీసుకు బయల్దేరుదురిగాని" అంది.

డాక్టరమ్మ బ్యాగ్ సర్దుకుంటూ వెంకటలక్ష్మి గారు! మీకిప్పుడో షాకింగ్‌న్యూస్ చెప్పాలి. అది వింటే మీకు కామెడీ కబురనిపిస్తే నాకేమిస్తారు? అని అడిగింది. పండరీనాథ్ తండ్రికి విషయం అర్థమైపోయింది. నవ్వాడు. డాక్టర్ గారూ! నన్ను సస్పెన్సుతో చంపక విషయం తొందరగా చెప్పండి. అప్పుడు మీకేమివ్వాలో ఆలోచిస్తాను అంది. పండరి అక్కడ నిలబడి ఉంటే తండ్రి ఆ టాబ్లెట్స్ తీసుకు రారా! అన్నాడు. డాక్టరమ్మ మనోహరి భుజమ్మీద తడుతూ వెంకటలక్ష్మి గారు మీరు నానమ్మ కాబోతున్నారు. పండరీనాథ్ తండ్రి కాబోతున్నాడు అంది. వెంకటలక్ష్మి వెంటనే వంటింట్లోకి వెళ్ళి గెస్టుల కోసం చేసిన స్వీట్ మైసూర్‌పాక్ ప్లేట్‌లో పెట్టి తీసుకొచ్చి ఇచ్చింది. అందరి ముఖాల్లో ఆనందం నాట్యమాడింది.

ఆ భార్యభర్తలిద్దరూ అక్కణ్ణుంచి వెళ్ళిపోయాక " ఓయబ్బో! ఆ మాత్రం దానికి మగణ్ణి అదే తట్టి మరీ చెప్పాలిగావును. మాయదారి బిళ్ల బెట్టు. మేమూ ముప్పై యేళ్లుగా సంసారాలు చేస్తున్నాం! ఏనాడూ ఈ అతి ఎరగం" అంది వెంకటలక్ష్మి. ఇంటికొచ్చిన పేరాంటాళ్ళకి సారెపొట్లాలు యిచ్చి కుంకుమ బొట్లు పెట్టి సాగనంపింది. వెళ్తూ వెళ్తూ ఆ ఇద్దరూ వదినా నీకు సమయం చిక్కితే మా ఇద్దరి ఇంటికి రాకూడదూ అన్నారు.

"వీలు చూసుకుని అలాగేలే వస్తాను. ఇది రాకముందు మేం ముగ్గురు ఏ చీకూ చింతా లేకుండా ఇంత ఉడకేసుకుని తిని కాలక్షేపం చేసేవాళ్ళం. ఈ మహాతల్లొచ్చాక నా బ్రతుకు మరీ హీనంగా తయారయ్యింది. పండరికి పెళ్ళి చేస్తే నా కష్టాలు గట్టెక్కుతాయనుకున్నా! అబ్బే అంత అదృష్టమా! నాకిదో గుదిబండలా తయారయ్యింది. రాత్రి పన్నెండింటి దాకా టి.వి. చూస్తుంది. తెల్లవారి తొమ్మిదిం టికి గాని పడక గదిలోంచి ఊడిపడదు. పనిమనిషి వాకిలి ఊడ్చి, పాత్రలు కడిగి ఏడున్నరు వెళ్ళిపోతుంది. ఇంక ఆయన ఆలనాపాలనా కాఫీ టిఫిన్లు వంటా వార్పులు అన్నీ అయ్యేటప్పటికి ఇదిగో పది దాదాపు ఆయ్యీరుకుం0శ్వటుంది. ఇలా ఎన్నాళ్ళింకా నేను కష్టపడాలో" అంది.

సులక్షణ, కృష్ణతులసీ వస్తామని వెంకటలక్ష్మికి చెప్పి వెళ్ళిపోయారు.

లోగడ మనోహరితో కాలేజీలో చదివిన నాన్సి, రాగిణి, పద్మ అనే ముగ్గురు స్నేహితురాళ్ళు భర్త అలా ఆఫీసు కెళ్ళాక ఇలా వచ్చారు. ముందుగా వాళ్ళకి టీ ఇచ్చింది.

అందులో రాగిణి మనోహరితో " ఎలాగుందే నీ కొత్త కాపురం?"అని ప్రశ్నించింది. కళ్లజోడు పెట్టుకున్న పద్మ స్నేహితురాలిని ఉద్దేశించి "మనో! ఇవ్వాళ మేమంతా మన ఊరి ఆదర్శ మహిళా మండలి వెల్‌ఫేర్ అసోసియేషన్ బిల్డింగు కట్టేందుకు డొనేషన్లు వసూలు చేస్తున్నాం" అంది.

నాన్సీ తన వంతుగా " నువ్వు కాదనకుండా మా కూడా రావాలి. మాతో కొద్దిగా కోపరేట్ చేయాలి. మరి.. మీ అత్తగారు అందుకు అంగీకరిస్తారా!' అంటూ అనుమానం వ్యక్తం చేసింది.

" పదండైతే నేను రెడీ! మీరు ఓ మంచి పని కోసం రమ్మంటుంటే ఆవిడెందుకు వద్దంటారు" అంది.

రాగిణి ఆమె చేతులు పట్టుకుని" సారీ! పద్దూకి ఏం మాటాడాలో, ఎలా మాటాడలో బొత్తిగా తెలీదు. ఈ నాన్సీ కూడా అంతే అంది. నాన్సీ, పద్మా సారీనే మనో! ఏదో సరదాకన్నాం. లోగడ ఎన్ని సమాజ హిత కార్యక్రమాలకు నువ్వు చేదోడు వాదోడై చందాలు వసూలు చెయ్యలేదు అంది. కొద్దిసేపు వెయిట్ చెయ్యమని లోనికెళ్ళి గులాబీ రంగు జాకెట్ లంగా మేచింగువి వేసుకుని ఎర్రరంగు ఓణీతో బైటికొచ్చింది మనోహరి.

ఎండ మండిపోతూండడంతో నలుగురూ తలో కూల్‌డ్రింక్ తాగారు. బిల్డింగు ఫండు వసూలైది. లెక్కేస్తే పన్నెండు వేలుంది. మహిళా మండలి ప్రెసిడెంటుకు అందజేసారు.

ఆమె తన ఇంట్లోనే ఆ నలుగురికీ భోజనాలు ఏర్పాటు చేసింది. మనోహరికి వెంకటలక్ష్మి ఫోన్ చేసింది." భోజనం చెయ్యలేదు. ఎక్కడున్నావమ్మా ? పండరి ఫ్రెండ్స్ ఇద్దరు ఢిల్లీ నుంచి వచ్చారట. వాళ్లు లంచ్‌కి మన ఇంటికొస్తున్నారు. భోజన చేసి రైలు ఎక్కుతారట. వెంటనే నువ్వు ఇంటికొచ్చేయ్. మా వాడూ ఆఫీసులో పర్మిషన్ పెట్టి వచ్చేస్తానన్నాడు " అని చెప్పింది. మనోహరి ఆలశ్యం చెయ్యకుండా ఇంటికి వచ్చేసింది. మహిళా మండలి ప్రెసిడెంటమ్మ ఇంట్లో చేసిన భోజనం మనోహరికి మాటిమాటికీ పులిత్రేనుపు వస్తోంది.

అత్తగారికి చేదోడువాదోడై తొందర తొందరగా వెజిటబుల్ బిర్యానీ చేసింది. పప్పు, వేపుళ్ళు రెండు కూరలు, రసం, పెరుగూ రెడీ చేశారు. స్నేహితులతో బాటు పండరీ వచ్చాడు. వాళ్లు ఆనందంగా భోజనం చేసి ఆదరాబాదరా బండికి వెళ్లిపోయారు. పండరీ వాళ్లని రైల్వేస్టేషన్ దగ్గర దిగబెట్టడానికి వెళ్ళాడు.

వాక్‌మెన్ పెట్టుకుని పాటలు వింటూ నాలుగు కావస్తుండగా మనోహరి పెరట్లో మల్లెమొగ్గలు కోస్తోంది. వీధి తలుపు ఎవరో కొట్టినట్లై వెళ్ళి తలుపు తీస్తే మావగారు. సిగ్గుతో ప్రక్కకు తప్పుకుంది. కోసిన పువ్వులు రెండు దండలు కట్టింది. అత్తగారికి ఒకటిచ్చి తన గదిలో దండేన మరోటి తగిలించింది. వీధి వాకిలి ముందు కళ్ళాపు జల్లి ముగ్గులెడదామని వంగి ముగ్గులేస్తూ స్పృహ తప్పి పడిపోయింది మనోహరి.

ఎందుకో మనోహరి మావగారూ, వెంకటలక్షీ ఏం జరిగిందోనని అక్కడి కొచ్చారు. పండరి భార్యను భుజాని కెత్తుకుని ఇంట్లోకి తీసుకొచ్చి మంచం మీద పడుకోబెటా ్టడు.

ఆమె ముఖంపై చల్లని నీళ్ళు చిలకరించాడు. అమ్మా అంటూ మూలిగి, కాస్త తేరుకుంటూ అందర్నీ అయోమయంగా చూస్తూ నాకేమయ్యింది అని ప్రశ్నించింది మనోహరి. వెంటనే ఫోన్ చేసి లేడీ డాక్టర్ని బయల్దేరి అర్జంటుగా రమ్మన్నాడు పండరి. మనోహరి ఈ మాత్రం దానికి ఆవిడెందుకు అంది.

పది నిమిషాల్లో లేడీ డాక్టర్ తన స్కూటీ మీద వచ్చి చెక్ చేసింది. మావగారు అత్తగారి వైపు ఒకసారి నవ్వుతూ చూసి డాక్టర్ మనోహరి కళ్ళురెప్పలు విప్పిచూసింది. బలానికి ఒక న్యూరోబిన్ ఇంజక్షన్ చేసింది. బిళ్ళలు రాసిచ్చింది.

డాక్టరమ్మ బ్యాగ్ సర్దుకుంటూ వెంకటలక్ష్మి గారు! మీకిప్పుడో షాకింగ్‌న్యూస్ చెప్పాలి. అది వింటే మీకు కామెడీ కబురనిపిస్తే నాకేమిస్తారు? అని అడిగింది. పండరీనాథ్ తండ్రికి విషయం అర్థమైపోయింది. నవ్వాడు. డాక్టర్ గారూ! నన్ను సస్పెన్సుతో చంపక విషయం తొందరగా చెప్పండి. అప్పుడు మీకేమివ్వాలో ఆలోచిస్తాను అంది. పండరి అక్కడ నిలబడి ఉంటే తండ్రి ఆ టాబ్లెట్స్ తీసుకు రారా! అన్నాడు. డాక్టరమ్మ మనోహరి భుజమ్మీద తడుతూ వెంకటలక్ష్మి గారు మీరు నానమ్మ కాబోతున్నారు. పండరీనాథ్ తండ్రి కాబోతున్నాడు అంది. వెంకటలక్ష్మి వెంటనే వంటింట్లోకి వెళ్ళి గెస్టుల కోసం చేసిన స్వీట్ మైసూర్‌పాక్ ప్లేట్‌లో పెట్టి తీసుకొచ్చి ఇచ్చింది. అందరి ముఖాల్లో ఆనందం నాట్యమాడింది. మనోహరి బుగ్గలు సిగ్గుతో ఎరుపెక్కాయి.



ఈ ప్రపంచం కఠినాతి కఠినమైంది. ఈ వాస్తవాన్ని ఎదుర్కోవడంలోనే సంతోష రహస్యం ఇమిడి వుంది. -బెర్ట్రండ్ రస్సెల్

సూర్య బుడత



# సెల్‌ఫోన్

'ఒరేయ్ శ్రవణ్! కాలేజీకి టైమవుతుంది. నిద్రలే నాన్నా. ఇంకా ఎంత సేపు పడుకుంటావ్" అంటూ పిలిచింది తల్లి శ్రావణి. " నేను కాలేజీకి వెళ్లను నేను చదువుకోను" అని జవాబిచ్చాడు శ్రవణ్". ఎందుకురా ఏమయింది ? అంది తల్లి.

" నాకు కొత్తబండి కావాలని నెల రోజుల నుంచి చెప్పుతున్నా. అయినా కొనిస్తలేరు. నాకు బండి , సెల్ ఫోన్ కావాలి ఒక్కొక్కడు మెడల బంగారం చైన్, చేతికి బ్రాస్‌లెట్, ఉంగరాలు, కొత్తకొత్త డ్రెస్‌లు వేసుకుని బండ్ల మీద కాలేజీకి వస్తున్నారు. మీనాన్న టీచరు నీవు గిట్ల ఎందుకు వస్తవు అని నాఫ్రెండ్స్ అడుగుతున్నారు" అన్నాడు శ్రవణ్.

"నీ తమ్మున్ని చూస్తే అట్లున్నడు . వానికి మెదడు వికసించడం లేదు. చదువు రాదు. తిని తిరగబట్టే. కొంచెము చదువు అచ్చినోడివి ఇట్లా చేయవడితివి" అని బాధపడింది శ్రావణి.

" తాతలు సంపాదించిన ఆస్తి లేదు. ఒక్క ఉద్యోగం మీద ఎన్ని కోరికలు నేరవేరుతాయి. నాకూ బంగారం పెట్టుకోవాలని లేదా ? నల్లపూసలు తోని కాలం గడుపుతున్నా. నాకు మంచి బట్టలు కట్టుకోవాలని లేదా? మీరు మంచిగ ఉంటే చాలు అని అనుకుంటున్నా. మీ నాన్నను ఎప్పుడన్నా బాధపెట్టినా . మీనాన్నమ్మ , తాతయ్యల మందులకే డబ్బంతా ఖర్చు కావట్టే " అని ఏడ్చింది శ్రావణి.

" ఇంకా రెండు సంవత్సరాలు మీరు ఖర్చు పెడితే నా చదువు అయిపోతది. నేను ఏదో ఒక పని చేసి బతుకుతా . అప్పుడు మీరు నాకు ఇవ్వవలసినఅవసరం లేదు. నా కోరిక బండి, సెల్‌ఫోన్ కావాలి " అని మంకుపట్టు పట్టాడు శ్రవణ్.

"నాన్న బయటకు వెళ్లాడు వచ్చినంక చెబుతా, నీవు లేచి కాలేజీకి వెళ్లు" అంది తల్లి.

"నాన్న వచ్చినాంక నేను లేస్తా" అన్నాడు శ్రవణ్.

వెంకటేశం బజారు నుండి కూరగాయలు తీసుకుని వచ్చాడు.

"శ్రవణ్ నిద్రలేవలేదా?కాలేజీకి పోడా" అన్నాడు వెంకటేశం.

"వానికి బండి, సెల్‌ఫోన్ కొనిస్తే కాలేజీకి పోతాడట. లేకుంటే చదువు కోడట! " అంది శ్రావణి.

"చిట్టి కదుతున్నా అది ఎత్తి నెలరోజుల వరకు బండి, సెల్‌ఫోన్ కొనిస్తా లేచి కాలేజీకి పొమ్మను " అని చెప్పి స్కూలుకు వెళ్లి పోయాడు వెంకటేశం.

ముసుగు కప్పి పడుకున్న శ్రవణ్ , తండ్రి మాటలు వినగానే లేచి సంతోషంతో గంతులు వేశాడు.

అన్నట్లుగానే నెల రోజులకు బండి , సెల్‌ఫోన్ కొనిచ్చాడు వెంకటేశం.

" ఇది కొనియ్యి అది కొనియ్యి అని ఆడించినట్లు కాదు .బుద్ధిగా చదివి మంచి ర్యాంకు తెచ్చుకోవాలి" అంది శ్రావణి.

"తప్పకుండా చదువుతాను అమ్మా!" అన్నాడు శ్రవణ్. శ్రవణ్ ఎంత అల్లరి చేస్తాడో అంత మంచిగా చదువుతాడు తన క్లాసులో . సెకండు మార్కులు తనవే.

అన్నట్లుగానే చాలా కష్టపడి చదివాడు శ్రవణ్ . ఈ రోజు ఆఖరు పరీక్ష " అమ్మా ! నేను పరీక్ష రాసి మా ఫ్రెండ్సు ఇళ్లకు వెళ్లొస్తా నా కొరకు ఎదురు చూడకు" అన్నాడు శ్రవణ్.

"రేపు పోదువు లేరా! ఈ రోజు రెస్టు తీసుకో .ఇప్పటి దాకా చదివావు కదా!" అంది తల్లి .

శ్రవణ్ పరీక్ష రాసి బయటకు వచ్చాడు. బాగా రాశానని తృప్తితో బండి నడుపుతున్నాడు. జేబులో ఉన్న సెల్ మోగింది. సిద్దిపేటలో ఉన్న ఫ్రెండ్ మహేశ్ ఫోన్ చేశాడు. పరీక్షలు ఎలా రాశావని బండి నడుపుతూ మాట్లాడుతున్నాడు. ఎదురుగా వస్తున్న ఆటోను బండి గుద్దేసింది. ఎగిరి కిందపడ్డాడు శ్రవణ్. స్పీడ్ గా వెళ్లకపోవడంతో కాలుమాత్రమే విరిగింది. లేకపోతే ప్రాణాలు పోయేవి.

శ్రవణ్ మేనమామ కైలాసం హాస్పిటల్‌కు వచ్చి " సెల్‌ఫోన్‌లో మాట్లాడుతూ బండి నడపడమేమిటీ? నేటి యువతకు ఇదో పెద్ద ఫ్యాషనయ్యింది. మొన్న విక్రం అనే అబ్బాయి బండి నడుపుతూ సెల్‌లో మాట్లాడాడు ఎదురుగా వస్తున్న లారీ గుద్ది అక్కడికక్కడే ప్రాణాలు వదిలాడు " అంటూ కోప్పడ్డాడు.

"ఫోన్ వద్దురా అంటే వినకపోతివి? కాలు విరిగింది. హాస్పిటల్ ఖర్చు లెట్లా పెట్టుకోవాలే. నీ చదువు ఖర్చులెలా భరించాలి? " అంటూ తల్లి శ్రావణి ఏడ్చింది.

"అమ్మా ! ఇక నుంచి బండి నడుపుతూ సెల్ మాట్లాడను ఐనా ఇప్పుడు నాకు సెల్‌ఫోన్ వద్దు " అంటూ లెంపలేసుకునానడు శ్రవణ్.

– రేగులపాటి విజయ లక్ష్మి

## • పద్యాలు తెలుసుకుందామా

తలనుండు విషము ఫణికిని
వెలయంగా దోకనుండు వృశ్చికమునకున్
తలతోక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ

**భావము:** పాముకు విషము నోటిలో ఉన్న కోరల్లో ఉండును. తేలుకు తోక చివర ఉండును. కానీ దుర్మార్గుడకు శరీరం అంతా విషయం వ్యాపించి ఉండును. అందుచే దుర్మార్గుడితో చాలా జాగ్రత్తగా ఉండాలి.

## దారిని చూపండి

పిల్లలూ ఈ రాణికి దారిని చూపండి




## తేడాలు గుర్తించండి



పిల్లకాయలు ఈ బొమ్మలో తేడాలని గుర్తిద్దామా!

## రంగులు వేయండి

ఈ ట్వీటీ డక్ మరియు టెడ్డీబేర్‌కి బొమ్మలకి రంగులు వేయండి



## చుక్కలు కలపండి

పిల్లలూ ఈ అంకెలను కలపండి చూద్దాం!





ఇతరులు మనల్ని ఎలా గౌరవించాలని కోరుకుంటామో, ఇతరుల్ని మనం అలాగే గౌరవించాలి - షేక్స్‌పియర్

వాత్సాయన

# తొందరపడకు సుందరవదనా...



**రాఘవకు పట్టుమని పాతికేళ్లు వుండవు. మంచి సాఫ్ట్‌వేర్ ఉద్యోగం ఉంది కదా అని రీసెంట్‌గా అప్సరసలాంటి అమ్మాయిని కూడా పెళ్లిచేసుకున్నాడు. హ్యాపీగా గడిచిపోతున్న వాళ్ల జీవితంలో...హఠాత్తుగా కలతలు రేగాయి. అప్పటిదాకా సుఖాలకు అలవాటుపడి...ఎసి లేనిదే నిద్ర కూడా పోని రాఘవ ఖర్చులు తగ్గించుకుంటున్నాడు...వీకెండ్ ప్రోగ్రామ్‌కి కనీసం పదివేలయినా ఖర్చుచేయందే నిద్రపోని రాఘవ అసలు బయటకు వెళ్లడమే మానేశాడు. ఇది మంచి పరిణామమే అనుకుంటే...చీటికీ మాటికీ భార్యపై అసహనాన్ని ప్రదర్శిస్తుంటాడు. అన్నింటికీ మించి పడక సుఖం అందించలేకపోతున్నాడు. ఇంటికి ఆలస్యంగా రావడం...వచ్చిరాగానే తింటం...పడుకోవడం...మళ్లీ తెల్లారిలేచి డ్యూటీ...ఇదే జీవితంలా అలవర్చుకుంటున్నాడు...ఇలా రాఘవే కాదు ఐదంకెల జీతగాళ్లు అంతా ఇప్పుడు తమ భవిష్యత్తు ఏమవుతుందా అని ఆలోచిస్తూ...సంసార సుఖాలకు దూరం అవుతున్నారు...అదంతా కేవలం మానసిక ఒత్తిడికి లోనయ్యేనంటున్నారు నిపుణులు...**

మన దేశంలోనే కాదు...ఇప్పుడు ప్రపంచవ్యాప్తంగా అన్ని రంగాలలో ఉన్న వాళ్లను పట్టి పీడిస్తున్న సమస్య ఆర్థిక మాంద్యం. దాని దెబ్బతో ఆదాయవనరులు తగ్గిపోతున్నాయి. అన్ని కంపెనీలు ముందు జాగ్రత్త చర్యగా ఎక్కువ జీతం ఉన్న ఉద్యోగుల తొలగింపు కార్యక్రమాలు ముమ్మరం చేశాయి. అయితే ఆ ప్రభావం ఎక్కువగా సాఫ్ట్‌వేర్ ఉద్యోగులమీద ఎక్కువగా ఉండటంతో వాళ్లలో మానసిక ఒత్తిడి ఎక్కువయిపోయింది. దాంతో సెక్సువల్ లైఫ్ కూడా ఎంజాయ్ చేయలేకపోతున్నారని ఓ సర్వేలో తేలింది.

**స్ట్రెస్ హార్మోన్ల పాత్ర...**

హఠాత్తుగా ఏర్పడే మానసిన ఒత్తిళ్లను ఎదుర్కోవడానికి మన శరీరం ఏడ్రినాలిస్ హార్మోన్‌ను ప్రయోగించి తీవ్ర ఒత్తిడినుంచి మన శరీరాన్ని దూరం చేస్తుంది. కాకపోతే రోజురోజుకూ పెరిగిపోయే ఒత్తిళ్లను ఎదుర్కొనే క్రానిక్ స్ట్రెస్‌ని మన శరీరం ఎదుర్కోవడానికి సంసిద్ధంగా ఉండలేదనేది వాస్తవం. దాంతో మనిషిలో బడలిక, నిరుత్సాహం, నిస్తేజం వంటివి మనిషి శరీరంలో మెల్లిగా ప్రవేశిస్తాయి. మనిషిలోని రెసిస్టెన్స్ పవర్ కూడా మెల్లిగా క్షీణించడం మొదలవుతుంది. ఎప్పుడైతే రెసిస్టెన్స్ పవర్ తగ్గుతుందో...మానసిక ఒత్తిడితో కూడిన రుగ్మతలు ఒక్కసారిగా మనిషిమీద దాడిచేసే అవకాశం ఉంది. దాంతో మనిషి వాటి ప్రభావానికి పూర్తిగా లొంగిపోతాడు. దాంతో సెక్స్ పరమైన అంశాలను పెద్దగా పట్టించుకోడు. సంసార సుఖానికి ఏమాత్రం ప్రాధాన్యం ఇవ్వకపోవడంతో కాపురంలో కలతలు ఆరంభం అవుతాయి. బయటి సమస్యలకు తోడు...ఇంట్లో సమస్యలు ఏకుమేకై కూర్చుంటాయి. దాంతో అవి పెరిగి పెద్దయి కాపురాలు కూలిపోయే స్థితికి చేరుకుంటాయి.

**పెర్ఫామెన్స్ యాంక్సైటీ...**

మరి కొందరికి ఎటువంటి సమస్యలు లేకున్నా...శోభనం రాత్రి ఏదేదో ఊహించేసుకుని...మరేదే చేసేద్దామనే తొందరపాటుతో...ఏమీ చేయలేక...ఆందోళన పడిపోయి డీలా పడిపోతుంటారు. దానినే పెర్ఫామెన్స్ యాంక్సైటీ అంటారు. ఎక్కువగా తమని తాము నిరూపించుకుందామనుకుని కొందరు వేశ్యల వద్దకు పోయి ఫెయిలైపోతుంటారు. ఇది కూడా ఆ కోవకే వస్తుంది.

**మనచేతుల్లోనే...**

అయితే మానసిక ఒత్తిళ్లనుంచి మనం బయటపడలేమా? అని ప్రశ్నించుకుంటే దానికి సంబంధించిన మందులు తాత్కాలికంగా పనిచేసేవే తప్ప శాశ్విత నివారణ అంతా మన చేతుల్లోనే ఉంది. జీవితంలో ఎన్నో కాని పనులు ఉంటాయి. వాటన్నింటిని ఒక పద్ధతి ప్రకారం...ప్రణాళికాబద్ధంగా చేసుకుంటూ పోతే మనిషి ఒత్తిళ్లను జయించవచ్చు.

ఒత్తిళ్లన్నీ ఆర్థికపరమైనవే ఉండకపోవచ్చు....కొందరికి పని ఒత్తిడి...మరికొందరికి ఆరోగ్య పరమైన ఒత్తిడి...మరి కొందరికి మానసిక ఒత్తిడి...ఇలా చాలామందిలో చాలారకాలుగా ఉంటుంటాయి.

**అన్ని వయసులవారికీ....**

అంతా అనుకుంటుంటారు...ఏ ఒత్తిడీ లేనిది పసివయసు శిశువులకు అని...ఆ వయసులో ఉంటే ఒత్తిడి ఆ శిశువు మీద కూడా ఉంటుంది. ఎప్పుడు త్వరగా లేచి నడుద్దామా...తనని ఎవరూ పట్టించుకోవడంలేదే అనే ఒత్తిడి చిన్నప్పటినుంచే మన వాతావరణానికి అనుగుణంగా వచ్చేస్తుంటుంది. పెద్ద నగరాలలో నివశించే చిన్నారులు ఉదయం లేచినప్పటినుంచి...రాత్రి పడుకుండేదాకా...తీవ్ర ఒత్తిళ్లతో బతికేస్తుంటారు. స్కూలుకు టైంకు చేరుకోగలమా...ఇంటికి క్షేమంగా వెళ్లగలమా...అని ఇలా ఏ వయసు వారికి వుండే ఒత్తిళ్లు ఆ వయసువారికి ఉంటూనే ఉంటాయి.

**సమస్యలను అధికమించాలి...**

అయితే ఈ సమస్యలన్నీ పెద్దవిగా చూడనక్కరలేదు. ఆలుమగలు ఇద్దరూ కూడా వాళ్లకంటూ కొంత మాట్లాడుకునే సమయాన్ని కేటాయించుకోవాలి. ఎన్ని పనులున్నా వాటిని ప్రణాళికాబద్ధంగా చేసుకుంటే ఇద్దరికీ మంచిదే. అలాగే ఆర్థిక ఇబ్బందులున్న ఆలుమగలు కూడా ఇద్దరూ కలిసి పనిచేసుకోవడమో...లేకపోతే ఇంటి ఖర్చులు తగ్గించుకోవడమో...లేకపోతే తమ ఆదాయానికి అనుగుణంగా ఖర్చుచేయడమో లాంటి పనులు అలవరుచుకోవాలి. సాధ్యమైనంత వరకూ పిల్లలకు కూడా ఎవరి పనులు వాళ్లు చేసుకునేలా తయారుచేయాలి. రోజుకు కనీసం అరగంటసేపయినా వ్యాయామం, యోగా లాంటి వాటికి మన శరీరాన్ని అలవాటుచేయించాలి. కొందరికి చెడువ్యసనాలతో కూడిన అలవాట్లు ఉంటాయి. క్రమంగా మెల్లిగా ఆరంభమై చివరకు దాన్ని వదులుకోలేక అలవాటుపడిపోతారు.

తూర్పు-పడమర

# కోళ్ల ఫారాలకు వాస్తు



కోళ్ల ఫారాలకు తప్పని సరిగా వాస్తు వర్తిస్తుంది. ఎలాంటి భూమిలో మనం కోళ్లఫారాల నిర్మాణం చేస్తున్నామన్నది ముఖ్యం. కోళ్లకు ఒక ఆరోగ్యకరమైన వెచ్చదనం వాటికి ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉంది. ఒక కోళ్ల ఫారానికి మరోక కోళ్ల ఫారానికి కనీస పక్షం 80 అడుగుల దూరమైనా ఎడం వదలాల్సిన అవసరం ఉంటుంది. షెడ్డును దిశకు నిర్మాణం జరిపినప్పుడే వాటి అభివృద్ధిలో కీలకమైన విజయా లను మనం అందుకుంటాం. అలాగే అవి నిర్మించే టువంటి ఎత్తు వాటి పొడవులు, వెడల్పులు, చాలా క్రమశిక్షణతో కూడినటువంటి శాస్త్రీ య సూత్రాల పైన ఆధారపడి ఉంటాయి. కాబట్టి కోళ్ల ఫారాలకు వాస్తు తప్పనిసరిగా వర్తిస్తుంది. సరియైన విధానంలో సరియైన కొలతలతో మనం నిర్మాణం చేసుకోవలసిన అవసరం ఉంది.

**ఉన్న ఇంట్లో తప్పులు ఉన్నపుడు కొత్త ఇళ్లు కట్టుకోవచ్చా**

గృహ శుద్ధిలేకుండా నూతనగృహా నిర్మాణం చేయకూడదు అనేది వాస్తు సూత్రాలలో ప్రధాన మైనది. మనం ఉండేటువంటి గృహాంలో వాస్తు సంపదలేకుంటే నూతన గృహా సంపద చేతికి అందదు అనేది అనేక గృహ నిర్మాణ కర్తల అనుభవం సత్యం.

చాలా మంది తామున్న గృహాల గురించి పట్టించుకోకుండా కొత్త ఇళ్లను ప్రారంభిస్తూ ఉంటారు. తద్వారా కట్టే ఇళ్లలో తప్పులు చేయడం, ఆ తప్పులు సవరించుకోలేక పోవడం సకాలంలో డబ్బులు చేతికందక పోవడం, పనివాళ్లు రాకపోవడం, కొన్ని గృహసంబంధించిన వస్తువులు లభించక పోవడం తద్వారా గృహా నిర్మాణం పని పెండింగ్ అవడం జరుగుతూ ఉంటుంది.



**బాత్రూమ్‌లకు పైన సజ్జలు** : ఇళ్లల్లో ఉండే టాయిలేట్స్ పైన సజ్జలు వేస్తూ ఉంటారు. అవి ముఖ్యంగా కామన్ బాత్రుమ్‌లపైన మాత్రమే సజ్జలు వేసుకోవచ్చు. పడకగదిలో అంటే నైరుతి పడక గదిలో ఉండే టాయిలెట్ పైన లోరూఫ్ వేసుకోవద్దు. హాలులో ఉండే బాత్రుమ్‌పైన సజ్జలు వేసుకోవచ్చు. ఆ సజ్జలు 7 ఫీట్ల పైన ఉండాలి.

ఆ సజ్జల మీదకు వెళ్లడానికి పడక గదిలోనుంచి కాకుండా హాలులోనుంచి, కిచెన్‌లోనుండి వెళ్ళే ఏర్పాటు చేసుకోవచ్చు. సహజంగా కామన్ టాయిలెట్ పడమరలో కాని దక్షిణంలో కాని రావాలి. అలాంటి వాటికి సజ్జలు ఏర్పాటు చేసుకుంటే అనుకూలంగా ఉంటా యి. ఇంట్లో సానుకూల వాతావరణం ఏర్పడుతుంది.

**పోర్టికో ఎలా కట్టుకోవాలి** పోర్టికోలు చాలామంది క్యాంట్‌లివర్ ఎత్తులో తీసుకుని కట్టుకుంటూ ఉంటారు. ఇది పాత పద్దతిగా అమలులో ఉంది. కాని దానివల్ల గూటిలో చీకటి వచ్చే అవకాశం ఉంది. వాస్తుపరంగా అది ఒక ప్రతికూల వాతావరణాన్ని కలిగిస్తుంది. అలా కాకుండా పోర్టుకో పొడవులో కావలసినంతగా తూర్పు ఈశాన్యంలో స్లాబ్‌ని ముందుకుతీసుకుని ఆ బాల్కానినీ ఎల్ ఆకారంలో ఆ బాల్కనీ కింద ఫిల్లర్స్ లేకుండా భీముల ఆధారంతో ఫోర్టికోను ఏర్పాటు చేసుకోవచ్చు.



## జాతకం

**నా ఆర్థిక పరిస్థితి ఏం బాగోలేదు. గత నాలుగు నెలలుగా శాలరీ, నా ఉద్యోగ స్థితి ఎలావుంటుంది? భవిష్యత్తులో వేరే ఉద్యోగం దొరుకుతుందా?**

**– కె. లక్ష్మీ కుమార్, నెల్లూరు**

మీరు ఇపుడున్న జాబ్‌లోనే కొంతకాలం ఉండండి. 2014 నవంబర్ తర్వాత మార్పుంటుంది. ఈ సంవత్సరం సెప్టెంబర్ నుంచి బాగానే ఉంటుంది.
కొన్ని పరిహారాలు పాటించడం మేలు.
'సుమంతో సుమంతో కార్తవీర్యార్జునాయనమః' అనే మంత్రాన్ని రోజూ గంటసేపు జపించడం

'శ్రీరాజమాతంగ్యైనమః' మంత్రాన్ని ప్రతి రోజు కనీసం గంట పఠించండి. ఇంట్లో ఏమైనా ఈశాన్య దోషాలుంటే సరిచేసుకోగలరు. వేలుకి రత్నాలేమైనా ఉంటే కొన్ని రోజులు తీసెయ్యడం చాలా మంచిది. ప్రతి మంగళవారం దేవాలయ సందర్శన చేయండి. 21 వారాలలో మంచి ఫలితాలుంటాయి.

★★★

**మేడమ్, నాకు ఉద్యోగం ఎప్పుడు దొరుకుతుంది?**

**– వెంకట్, ఏలూరు**

మీకు ప్రస్తుతం ఏలిన నాటి శని దశ నడుస్తున్నది. అయినప్పటికీ ఈసంవత్సరం కన్నా వచ్చే సంవత్సరం ఫలితాలు బాగుంటాయి. పరిహారాలు పాటిస్తే అన్ని విధాలా మంచిది.

# తూర్పు ముఖమున్న ఇల్లు సరికాదు

మేలు. ఏ రకమైన రత్నం ధరించవద్దు కొన్ని రోజులు. ప్రతి బుధవారం దేవాలయ సందర్శన మంచిది. వచ్చే సంవత్సరం నవంబర్ నుంచి రవి ప్రవేశం వలన స్థలమార్పు కూడా ఉంటుంది.

★★★

**నాకు ఉద్యోగం ఎప్పుడు దొరుకుతుంది? ప్రయివేటు ఉద్యోగం దొరుకుతుందా లేక ప్రభుత్వ ఉద్యోగం వస్తుందా?**

**– పింగళి శ్రీనివాస్, విజయవాడ**

గవర్నమెంట్ జాబ్ అవకాశాలు కొంచెం సుమా రుగా ఉన్నాయి. ఏ జాబ్ చేసినా మంచిదే చేసే అవకాశాలున్నాయి ముందు ముందు. అందుకు కొన్ని పరిహారాలు పాటించడం మేలు. ఉగాది సమయానికి వృత్తి, వివాహం వరుసగా సూచింపబడుతున్నాయి.

**పరిహారాలు...**

ఉండే ఇల్లు ఎట్టి పరిస్థితుల్లో వాయువ్య ముఖం (పశ్చిమ /ఉత్తరం) కాకూడదు. అలాగే వాయు వ్యంలో ఎలాంటి దోషాలు ఉండరాదు. బహుశా మీరుండే ఇంటికి ఈ రకమైన దోషాలు ఉంటే చూసుకోండి. వేలుకి 'ము త్యం' పనికిరాదు. కుడిచేతి ఉంగరం వే లుకి కెంపు, చూపుడు వేలుకి కనకపుష్య రాగం కలిపి ధరించండి. తూర్పు, ఈశాన్యం మీకు బాగుంటాయి.

★★★

**నా పుట్టిన తేది సరిగా తెలియదు. నేను 1996లో ఎంసీఏ పూర్తి చేశాను. ఇప్పటికీ ఉద్యోగ స్థిరత్వం లేదు. తీవ్రమైన ఆర్థిక ఇబ్బందులతో బాధపడుతున్నాను. ప్రస్తుతం ఓ చిన్న కంపెనీలో తక్కువ శాలరీకి పనిచేస్తున్నాను. నాకు పర్మినెంట్ ఉద్యోగం ఎప్పుడు లభిస్తుంది.**



**– జి.రామ్మోహన్**

లేని వారికి దానము ఇస్తు న్నట్లుగా భావన చేయండి. వీలైతే పంచదార, బియ్యం పిండి కలిపి ఇంట్లో ఎక్కడన్నా కనీసం కొన్ని రోజులు చీమలకు ఆహార పదార్థంగా అందించండి.

తూర్పు ముఖమున్న ఇల్లు మీకు సరిపడదు. వీలైనంత వరకు మీ కార్యక్రమాలు 'పడమర' వైపు అయితే మంచిది. మీకు పడమర, ఉత్తరం పనికి వస్తాయి. ఇంద్రనీలం (1 కేరట్‌పైన) కుడిచేతి మధ్య వేలుకి ధరించండి. ప్రతి ఆదివారం దేవాలయ సందర్శన. సూర్య నమస్కారాలు చాలా మేలు. అరుణ, ఆదిత్య హృదయ పారాయణ మంచిది.

★★★

**నా డేట్ ఆఫ్ బర్త్ తెలియదు. నేను కోరుకున్న నెంబర్ 99. నేను ఏ పని చేసినా కలిసి రావడం లేదు. ప్రతి విషయంలో ఆటంకాలు ఎదురవుతున్నాయి. రావలసిన డబ్బులు రావడం లేదు. ఏం చేస్తే నాకు కలిసివస్తుందో చెప్పండి.**

**– మద్దినేని అంకమ్మ చౌదరి**

మీరు అడిగిన దాని ప్రకారం నడుస్తున్న సమయంలో తీవ్ర ఆటం కాలున్నాయి.
చివరి క్షణంలో ఆశాభంగాలు వస్తున్నా యి. కొన్ని పరిహారాలు పాటించండి. ప్రతి గురువారం, శనివారం దేవాలయ సందర్శన, శనివార నియమం, శనికి సంబందించి 'నువ్వులు' దానం. రత్నా లు ధరించనవసరం లేదు. కొత్తగా ఇక ముందు ఎవరికీ అప్పులు ఇవ్వొద్దు.
ఆరు వారాల పాటు ప్రతి గురువారం ఆవుకి అరటిపండు పెట్టండి.

మీ సందేహాలని క్లుప్తంగా (మనిషికి 1 ప్రశ్న మాత్రమే) ఈ క్రింది వివరాలు వ్రాసి పంపండి. (పుట్టిన తేదీ వివరాలు లేనివారు 108 లోగా ఒక సంఖ్య వ్రాసి పంపండి. ఇది ప్రశ్న పద్ధతి, మనిషికి ఒక్క ప్రశ్న మాత్రమే)

పేరు : ....................................
పుట్టిన తేదీ : ................................
పుట్టిన సమయం : ............................
పుట్టిన ఊరు (మండలం) : ..................
ప్రశ్న : ....................................

పై వివరాలతో కూడిన లెటర్‌ను ఈ క్రింది అడ్రస్‌కు పంపండి...

'జాతకం' 'సూర్య' ఆదివారం

**SPR publications, Surya Soudha, Plot.No: 185, M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar, AyyappaSociety Opp: Hi-Tech City, Hyderabad - 500 072.**

## 26-3-2017 నుండి 1-4-2017 రాశిఫలం



మేషం: Aries( **అశ్విని, భరణి, కృత్తిక – 1**) : వ్యాపారా భివృద్ధి జరుగును. సంఘములో పలుకుబడి పెరుగుతుంది. ఉద్యోగస్తులకు ప్రమోషన్లు, కోరుకున్న చోటుకు బదిలీలు జరుగును. రాజకీయ రంగంలోని వారికి విశేషాభివృద్ధి కలుగును. విద్యార్థులకు ఉన్నత విద్యనభ్యసించే అవకాశం కలుగుతుంది. ఆది, సోమ, మంగళ, బుధ, గురువారములు అనుకూలిస్తాయి.



వృషభం: Taurus (**కృత్తిక – 2,3,4, రోహిణి, మృగశిర – 1,2**): రాజకీయ రంగాల వారికి బాగుండును. బంధువుల సహకారం లభించును. చెడ్డవారితో చెలిమి వలన కొన్ని సమస్యలు వస్తాయి. నూతన వ్యాపారములు మొదలు పెట్టెదరు. విద్యార్థులు రాణింతురు. ఉద్యోగస్తులకు బదిలీలు జరుగును. అర్థాష్టమ శనిగలదు. శ్రీ విష్ణువును పూజించుట మంచిది.



మిథునం: Gemini (**మృగశిర –3,4** ఊహించని సంఘటనలు జరుగును. ఉద్యోగస్తులకు అధికారుల వేధింపులు ఉండును. నూతన స్థలములందు వృత్తి, వ్యాపారములు చేస్తారు. ప్రభుత్వ రవాణా, విద్యుత్ శాఖ లందు పనిచేయువారికి బాగుండును. దానధర్మాలు చేయుదురు. క్లబ్బులు, లాటరీ రంగాలవారికి లాభించును.



కర్కాటకం: Cancer(**పునర్వసు –4,** స్థల వ్యాపారస్తులు ప్రత్యర్థుల కన్నా ముందుండి లాభాలు సంపాదిస్తారు. నిరుద్యోగులు, విద్యార్థులు పోటీ పరీక్షల్లో విజయం సాధిస్తారు. ఆరోగ్య విషయంలో ప్రత్యేక శ్రద్ధ అవసరం. కోర్టు సమస్యల నుండి విముక్తి లభిస్తుంది.కుటుంబ వ్యవహారాల్లో ఇతరులు జోక్యం చేసుకుంటారు.



సింహం: Leo (**ముఖ, పుబ్బ, ఉత్తర –1**) గృహోపకరణములు కొంటారు. పలుకుబడి సంపాదించుటకు గట్టి కృషి చేయుదురు. ప్రకటన, విద్యా రంగాల వారికి అనుకూలంగా ఉండును. విద్యార్థులు కష్టపడి చదవాలి. ముఖ్య విషయములందు నిర్ణయములు వాయిదా వేయడం మంచిది. ఏల్నాటి శని గలదు. శ్రీ విష్ణువును, వెంకటేశ్వరుని పూజించుట మంచిది. ఆది, సోమ, మంగళ వారాలు అనుకూలంగా ఉండును.



కన్య: Virgo ( **ఉత్తర – 2,3,4, హస్త, చిత్త –1,2**) విద్యార్థులకు మంచి అభివృద్ధి కలుగును. రాజకీయ, సినీ, నాటక, ఇతర కళా రంగాల వారికి బాగుండును. అనుకున్న పనులు శ్రమ మీద జరుగును. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. ఆర్థికపరిస్థితి బాగుండును. శత్రువులను జయింతురు. వివాహాది శుభకార్యాలు జరుగును. బాకీలు వసూలు అగును. రైతులకు లాభదాయకం..



తుల: Libra (**చిత్త –3,4, స్వాతి, విశాఖ –1,2,3**) రాజకీయ నాయకులకు పలుకుబడి పెరుగును. ఉద్యోగస్తులకు బదిలీలు, ప్రమోషన్లు లభించును. తలపెట్టిన పనులు సుఖాంతమవుతాయి. చేతి పనుల వారికి విశేష ధనలాభం కలుగును. గనులు, భూమి, రియల్ ఎస్టేట్ వ్యాపారులకు లాభించును. శుక్ర, శనివారములు అనుకూలించును.



వృశ్చికం: Scorpio (**విశాఖ –4 అనూరాధ, జ్యేష్ఠ**) రాజకీయ నాయకులకు బాగుండును. ధైర్యముగా, సాహసంగా ఉందురు. కొత్త స్నేహితులు పరిచయమవుతారు. గూడాచారులకు బాగుండును. వివాహాది శుభకార్యములు జరుగును. పనులు, బాధ్యతలు సకాలంలో నేరవేర్చుదురు. మంగళ, బుధ వారాలు అనుకూలం. కార్మికులకు, చేతి పనివారికి ధనలాభం కలుగును.



ధనుస్సు: Sagittarius (**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ –1**) వృత్తి వ్యాపారస్తులకు విశేష ధనలాభం కలుగును. వాహన లాభాలు కలుగును. నూతన గృహనిర్మాణం చేయుదురు. విద్యార్థులకు ఉన్నత విద్యనభ్యసించే అవకాశం వస్తుంది. పాపభీతి, దయ కలిగి యుందురు. దానధర్మాలు చేయుదురు. అందరి అభిమానం పొందుతారు. బుధ, గురువారాలు బాగుండును.



మకరం: Capricorn (**ఉత్తరాషాఢ –2,3,4, శ్రవణం, ధనిష్ఠ –1,2**): వృత్తి వ్యాపారములు సామాన్యంగా ఉండు ను. విద్యుశ్చక్తి, టెలిఫోను,నిర్మాణ రంగం వారికి బాగుం డును. స్వయం కృషి వలన లాభాలు కలుగును. ప్రయా ణాలు వచ్చును. స్నేహితులతో జాగ్రత్తగా వ్యవహరిం చవలెను. ఆర్థిక ఇబ్బందికలిగిననూ, సకాలములో ధనం లభించును. అనాలోచిత ప్రయాణములు చేస్తారు. అష్టమ శని గలదు. శ్రీ విష్ణువును ,శ్రీవెంకటేశ్వరుని పూజించాలి. అపవాదులు, అపోహాలు కలుగును.



కుంభం: Aquarius (**ధనిష్ఠ–3,4, శతభిష, పూర్వాభాద్ర– 1,2,3** ఆరోగ్యము బాగుండును. స్త్రీ స్నేహం లభించును. వ్యవసాయ దారులకు స్వల్ప లాభం. వృత్తి, పాల, ఉత్పత్తుల, వస్త్ర వ్యాపారులకు లాభించును. బంధుమిత్రులతో కలహాలు వచ్చును. అధిక ధన వ్యయం కలుగును. అనవసర ప్రయాణాలు వచ్చును. శ్రీ సుబ్రమణ్యేశ్వరుని ఆరాధించుట మంచిది.



మీనం: Pisces (పూర్వాభాద్ర –4,
ఈ రాశి అన్ని రంగాల వారికి అనుకూలంగా ఉండును. విశేష ధనలాభం కలుగును. శుభకార్యాలు జరుగుతాయి. గ్రామాధికారం సిద్ధించును. ఆది, సోమ, మంగళ వారాలు అనుకూలము.



**నిద్రపోయి కలగన్నాను బ్రతుకంతా సుందరమని. మేలుకొని కనుగొన్నాను బ్రతుకు పెద్ద బాధ్యత అని. -గొథె**

ఆలయం

# ఎల్లలు లేని సౌందర్యం ఎల్లోరా

ప్రసిద్ధమైన ఎల్లోరా గుహలు మహారాష్ట్రలో ఉన్నాయి. హైదరాబాద్ నుండి మన్మాడుకు పోయే రైలు మార్గంలో ఉన్న ఔరంగాబాదు స్టేషన్‌కు 26 కిలోమీటర్ల దూరంలో ఎల్లోరా గుహలున్నాయి. అజంతా గుహలు కూడా ఇక్కడకు దగ్గరలోనే ఉన్నాయి. అందుకే అజంతా- ఎల్లోరా గుహల చిత్ర శిల్పాలు భారతీయ కళావేత్తలనే కాకుండా ప్రపంచ కళాకోవిదులను కూడా ఆకర్షించి ప్రశంసలు అందుకున్నాయి. ఇవి ప్రకృతి రమణీయతకు సాక్షిగా నిలచిన నదీ పర్వతారణ్య పరిసరాలలో ఉండడం ఒక విశేషం. ఆ పర్వత సానువులలో అడవి, పలు రకాలైన సెలయేర్లూ ఎంతో మోహనంగా అలరిస్తాయి. ఇలాంటి అందమైన ప్రదేశాలలోనే మునులు తపస్సు చేసుకునే వారేమో! ప్రకృతి కళోపాసకులు, శిల్పులు, బౌద్ధ భిక్షువులు ఇలాంటి సుందర ప్రదేశంలోనే ఆ కళాలక్ష్మికి నీరాజనాలు పలికి తరతరాలుగా పులకింపజేస్తున్నారు. సృష్టికే శోభనిచ్చేంతటి సౌందర్యం మన శిల్పకళకు ఉంది. అందుకే భారతీయ శిల్పకళను తెలుసుకుందామని, ఆ అందాలను ఆస్వాదించడానికి ఎందరో విదేశీయులు ఈ అజంతా- ఎల్లోరా గుహాలయాలకు వస్తుంటారు.

అనేక శతాబ్దాలుగా ఎల్లోరా గ్రామం వెరూల్ అనే పేరుతో ప్రసిద్ధి గాంచింది. ఈ గ్రామం ప్రాచీన వాణిజ్య కేంద్రంగా పేరు పొంది, అరబ్, యూరప్ దేశాలనుండి ప్రజలు తమ వ్యాపార అవసరాలకు ఈ గ్రామాన్ని దర్శించే వారట.

**ఎల్లోరా గుహాలయాల్లో శిల్ప సౌందర్యం:** ఎల్లోరా కొండల్లోని 34 గుహల్లో శిల్పాలు చెక్కారు. హిందూ, బౌద్ధ, జైన మతాలకు చెందిన శిల్పరీతులు అన్నీ ఒకేచోట ఉండడం విశేషం. వీటిలో మొదటి 12 గుహలు బౌద్ధమతానికి చెందినవి. వీటిని ఐదో శతాబ్దం నుండి ఎనిమిదో శతాబ్దం మధ్యకాలంలో చెక్కారు. 13వ గుహ నుండి 29వ గుహ వరకూ హిందూమతానికి సంబంధించిన దేవతలూ, పౌరాణిక కథలను తెలుపుతాయి. ఇవి ఆరవ శతాబ్దం నుండి తొమ్మిదవ శతాబ్దంలో చెక్కినవి. 5 గుహలు అంటే 30 నుండి 34 గుహల వరకూ జైన మతానికి సంబంధించినవి. వీటిని ఎనిమిది- పది శతాబ్దాల మధ్య కాలంలో చెక్కినవి. ఈ గుహల్లో ఎక్కువ భాగం ధ్యానాది సాధనలు, విద్యను అభ్యసించడానికి వచ్చిన బౌద్ధ భిక్షువుల కొరకు ప్రత్యేక గదులుగా విభజింపబడ్డాయి. కొన్ని గుహలు రెండు అంతస్తులు, మరికొన్ని 3 అంతస్తులుగా గాలి, వెలుతురు ధారాళంగా వచ్చేవిధంగా కట్టబడి ఉన్నాయి. ఈ ఎల్లోరా గుహలన్నింటిలో మొదటి గుహ చాలా ప్రాచీనమైనది. దీన్లో శిల్ప విన్యాసం చాలా నిరాడంబరంగా ఉంటుంది. రెండో గుహ శిల్పకళతో కూడిన ఒక చైతన్యశాలగా ఉంటుంది. దీన్లో బుద్ధుడి వివిధ మూర్తులు, బోధిసత్వుని మూర్తులున్నాయి. దీనిపై కప్పు 12 పెద్ద స్తంభాలపై ఆధారపడి ఉంటుంది. ఈ గుహ గర్భాలయంలో సింహాసనాధీసుడై ఉన్న బుద్ధుని విగ్రహం ఉంది. ఈ శిల్పం చూపరులను ఆకట్టుకుంటుంది. మూడవ గుహలో బుద్ధుడిని మోస్తున్నట్లుగా విగ్రహాన్ని చెక్కారు. నాలుగవ గుహలో బుద్ధుడు బోధి వృక్షం కింద కూర్చున్నట్లుగా చెక్కారు. ఐదవ గుహ పెద్ద బౌద్ధ విహారశాల. ఇం దులో 24 స్తంభాలున్నాయి. ఈ గుహ నుండి ఆరవ గుహలోకి వెళ్లే ద్వారం ఉంది. ఈ గుహ పడమటి భాగం శిథిలమైనా పక్కగోడల మీద పూజలందు కున్న బుద్ధమూర్తులు బారులు తీరి ఉన్నాయి. ఈ గుహల్లో ఒక ఆశ్చర్యకరమైన మూర్తి ఒకటి ఉంది. ఆమె వీణాపాణిగా ఉన్న సరస్వతీదేవి మూర్తి. తరువాత గుహలు సామాన్యమైనవి. 8వ గుహలోని గర్భాలయానికి చుట్టూ ప్రదక్షిణ మార్గం కూడా ఉంది. ఈ గుహలోనే బౌద్ధుల జ్ఞానదేవత మహా మయూరి అనే మూర్తిని చూస్తాము. దీని తర్వాత మనకు కనువిందు చేసే గుహ పదవ గుహ.

ఈ 10వ గుహనే విశ్వకర్మ చైతన్యమని అంటారు. ఎల్లోరాలో చైత్యశాల ఇది ఒకటే. ఇది గొప్ప శిల్ప విన్యాసంతో బౌద్ధ గుహా లయాలన్నింటికీ మకుటాయ మానంగా వెలుగొందుతోంది. ఈ గుహాలయాన్ని విశ్వకర్మగుహ అని పిలుస్తారు. విశ్వకర్మ అనే శిల్పాచార్యుడు ఒక్కరాత్రిలోనే తన పరివారంతో ఈ గుహలో శిల్పాలను చెక్కాడుట. అందుకే ఈ గుహకు విశ్వకర్మ గుహాలయం అనే పేరు వచ్చిందని ఇక్కడ చెప్పారు. ఇక్కడ బుద్ధుని మూర్తి చాలా శాంతంగా, ధ్యాన నిమగ్నుడై ఎంతో సౌందర్యవంతంగా ఉంటుంది. అలాగే ఈగుహలో ఒక ప్రత్యేకత కూడా ఉంది. మనం ఒక ధ్వని చేస్తే అది ప్రతి ధ్వనించి ఆ ప్రతిధ్వనుల పరంపరలు మళ్లీ మనకే విన్పిస్తూ మెల్లగా తగ్గుతూ ఒక విధమైన ధ్వని సొంపుతో ముగుస్తాయి. అంతేకాక ఒక స్తంభాన్ని మనం మోగిస్తే ఇంకొక స్తంభం నుండి ధ్వని విన్పిస్తుంది. నిజంగా ఈ విశ్వకర్మ గృహాలయం చాలా వింత గొలుపుతుంది. 12వ గుహలో ధ్యానంలో ఉన్న బుద్ధుని పెద్ద విగ్రహం, ఈ విగ్రహం చుట్టూ బోధి సత్వ, భూదేవి పరివేష్టించి ఉంటారు. అంతేకాక ఇక్కడ ఉన్న పద్మపావు విగ్రహం చాలా సుందరంగా ఉంటుంది.

**హిందూ మతగుహలు** తరువాత 13వ గుహ నుండి 29వ గుహ వరకూ హిందూ మతానికి, హిందూ పౌరాణిక కథలను తెలిపే శిల్పాలతో ఉన్నాయి. వీటిలో 14వ గుహ రావణ పరాభావ శిల్పం అత్యద్భుతం. 15వ గుహలో నటరాజ శిల్పం, లింగం నుండి ఉద్భవిస్తున్నట్లుగా పరమేశ్వరుడు, ఆయనను స్తుతిస్తున్నట్లుగా బ్రహ్మ, విష్ణువుల శిల్పాలు అమోఘం. 16వ గుహ కైలాసగు హ అంటారు. ఈ కైలాసనాథ దేవాలయపు శిల్పం చాలా అద్భుతంగా ఉంది. ఈ దేవాలయం మొత్తం ఒకే రాతితో తొలిచి శిల్పించారు. అలాగే ఈ ఆలయం ముందు రాతి ధ్వజస్తంభం కూడా చాలా అద్భుతం. అలాగే 29వ గుహలో రావ ణుడు కైలాస పర్వతాన్ని ఎత్తబోవడం, శివుడు తన పాదంతో పర్వతాన్ని నొక్కడం ఈ భావాలన్నీ స్పష్టంగా ఈ శి ల్పం లో చూస్తాము.




# రామనామంలో సృష్టి రహస్యం

రామనామ వైభవం గురించి ఎంత చెప్పినా తక్కువే. మన పూర్వికులు దైవానుగ్రహం పొందడానికి సులభ మార్గంగా మనకు రామనామం జపించమని చెప్పారు. వారు చేసే ప్రతి పని ముందు శ్రీరామ అనడం మనం గమనిస్తూ వుంటాం. నిజం చెప్పాలంటే ఈ రోజు మన జీవితం ప్రతి సందర్భంలోనూ కష్టంగా ముందుకు సాగుతుంది. చిన్న విషయాలనుండి పెద్ద వాటి వరకు మనల్ని అనేక సంఘటనలు బాధిస్తూనే వున్నాయి.



ఈ కష్టాలకు కారణం మనకు సూక్ష్మమైన విషయాలను గ్రహించే శక్తి లేకపోవడం, దాని ద్వారా ముఖ్యమైన విషయాల పట్ల సరైన నమ్మకం కోల్పోవడం జరుగుతుంది. ఆ రోజుల్లో పేదరికమే ఉన్నా, సౌకర్యాలు తక్కువగానే వున్నా మనిషి జీవితం ఇంత దుర్భరంగా లేదు. లేటి మానవుల్లా అల్లకల్లోలంగా మాత్రం వారు లేరు. అందుకు కారణం వారికి వాస్తవాలేంటో అవాస్తవాలేంటో స్పష్టంగా తెలుసు. నేటి విద్యావిధానం పిల్లలకు జ్ఞానంతో కూడుకున్న చదువులు చెప్పకపోవడంతో కనీస అవగాహన లేకుండా బ్రతుకుతున్నారు. ముఖ్యంగా మన విద్యావిధానంలో సెక్యులరిజం పేరుతో మన సనాతన ధర్మాన్ని భవిష్యత్తరాలకు తెలియనివ్వకుండా కుట్రపన్నుతుంది. మరి మన జీవితం సునాయాసంగా మారాలంటే ఏం చేయాలి? ఏం చేయక్కర్లేదు కేవలం రామనామం జపిస్తే చాలు. ప్రతి పనికి రామనామాన్ని తగిలిస్తే చాలు ఈ చిన్న సాధనే నిన్ను తరింపచేస్తుంది. ఇంతకీ ఈ రామనామంలో ఏముంది అదికూడా తెలుసుకుందాం. రామ నామం గురించి పెద్దలు ఇలా శాస్త్రవాక్కులను చెప్పారు. రామ అనే పేరులో ర అ మ అనే శబ్దాలు పొందుపరచబడి వున్నాయి. అందులో ర అంటే అగ్ని అ అంటే సూర్యుడు మ చంద్రుడు తత్వాలు వున్నాయి. ఇవే కథా కాలనికి కారకాలు, సృష్టికి కారకాలు, సూర్య, చంద్రుల గమనమం వల్లనే కదా కాలం ఏర్పాడుతుంది. అగ్ని వల్లనే కదా ఆ కాలం, జీవము నిలబడుతుంది. ఈ ఒక్క నామంలోనే సృష్టి అంతా నిబిడీకృతం చేయబడిందో తెలిస్తే ఆశ్చర్యంగా లేదు.

ఈ మూడిట్లో వుండే ఆ తేజస్సే రామ అని వేదం ఎంత చక్కగా చెప్పిందో కదా...మనలో సూర్యుడు అంటే బుద్ధి, దృష్టి, శరీరము. చంద్రుడు అంటే మనసు. అగ్ని అంటే వాక్కు ఈ మూడే జీవక్రియకు మూలమైన విషయాలు ఈ మూడిట్లో కొలువై వున్న శక్తి రామమే కదా. మూలా ధారం నుండి సహస్రారం వరకు వున్న చక్రాలు సూర్యచంద్ర అగ్ని తవ్వాలుగా వున్నాయి అంటే మనలో శక్తి కేంద్రాలుగా కొలువుదీరి వున్నది రాముడు కాక ఇంకెవ్వరు. శ్రీ చక్రం వర్ణనలో కూడా మొదటి మూడు ఆవరణలు అగ్ని మండలం తరువాతి మూడు మండలములు సూర్య మండలము తరువాతి ఆవరణలు చంద్రమండలంగా చెప్పబడింది. అంటే శ్రీ విద్యా రహస్యం అంతా రామనామంలోనే కొలువుతీరి వున్నది.

సర్వమంత్రములు ఒక ఎత్తు

రామనామమను చిన్ని నామం ఒక ఎత్తు వేదములలో ఏడు కోట్లమంత్రములు వున్నాయని పెద్దలు చెప్పి వున్నారు. అన్ని మంత్రముల సారం రామనామంలో వుంది. సృష్టి నిర్మాణ నియమమంతా అగ్ని, శోమము అంటే నీరు అని వేదం చెప్పింది. అగ్ని నీరు ఈ రెండే సృష్టి నిర్మాణమునకు ఫార్ములా నేటి సైన్స్ ఇప్పటికి కనుకుంది. సూర్యుడు, అగ్ని కలిపితే అగ్ని తత్వం కాగా శోమము చంద్ర తత్వం. అంటే రామ అంటే అగ్ని శోమ త్వాలు అంటే సృష్టి కర్త రామడే అని ఆ ఒక్కనామమే చెబుతుంది. అగ్నిలో శోమము అంటే హోమద్రవ్యంగా వేసే చల్లిన వస్తువు ఈ రెండు కలవడమే యజ్ఞం అంటే రామ నామము చెబితే యజ్ఞం చేసిన ఫలం. ఇంతటి విశిష్టత కలిగిన రామనామము మించి రాముడుకి మించిన సాధన ఇంకేముంటుంది. రామనామము చాలదా జన్మతరించడానికి. కేవలము రామనా మమనే ఆత్మవిద్యను పట్టుకుంటే ఆ భగంతుడితో ఐక్యమయ్యే మార్గం దొరికినట్టే.



చట్టాలు ఎంత మంచివైనా వాటిని మన్నించేవారు అరుదు. అంతేకాక వాటిని అమలు చేయడం మరీ కష్టం. -ఫ్రాంక్లిన్

# వావ్!

## సమయ స్ఫూర్తి




ఒక సంవత్సరం ఎంత విలువైనదో
పరీక్షలో తప్పిన విద్యార్థినడుగు !
ఒక నెల ఎంత విలువైనదో
ఒక నెల ముందే పుట్టిన శిశువునడుగు !
ఒక వారం ఎంత విలువైనదో
వార్త పత్రిక సంపదకుడినడుగు !
ఒక రోజు ఎంత విలువైనదో
ఒకటో తేదీన జీతం రానివాడినడుగు !
ఒక గంట ఎంత విలువైనదో
శ్రమించే శ్రామికుడినడుగు !

ఒక నిమిషం ఎంత విలువైనదో
రైలు మిస్సైన ప్రయాణీకుడిని అడుగు !
ఒక సెకను ఎంత విలువైనదో
యాక్సిడెంట్‌లో ప్రాణాలు దక్కిన
వాడినడుగు !
ఒక మిల్లి సెకను ఎంత విలువైనదో
ఒలింపిక్స్‌లో సెకండ్ వచ్చిన వాడినడుగు !
ఒక మైక్రో సెకను ఎంత విలువైనదో
గమ్యం చేరలేకపోయిన
వ్యోమగామినడుగు !













0883 - 246 2565
903 246 2565

MOHAN PUBLICATIONS

# మోహన్ పబ్లికేషన్స్,

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533101.

WWW.MOHANPUBLICATIONS.COM

## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | |
|---|---|
| 28. తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. శివపూజ | 10-00 |
| 36. వీరభద్ర పూజ | 10-00 |
| 37. ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. రామదేవుని కథ | 10-00 |
| 41. శివదేవుని కథ | 10-00 |
| 42. లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. పార్వతీకల్యాణం | 25-00 |
| 52. సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. అష్టనాగపూజ | 36-00 |
| 55. పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. హనుమద్ వ్రతం | 36-00 |
| 61. పంచాయతన పూజ | 63-00 |
| 62. 28 వ్రతములు | 120-00 |

